శేషేంద్ర

# సౌరాబు

(స్వతంత్ర పద్యకావ్యం)

1947-48

జ్యోత్స్న ప్రచురణ
హైదరాబాద్

సొహ్రాబు
పద్యకావ్యం
తొలిముద్రణ : 1954
జయ వసంతం

ప్రకాశకులు :
శ్రీ చెఱుకువాడ వెంకటరత్నంగారు
కొండెవరం, తూ. గో. జిల్లా

రెండవ ముద్రణ : నవంబర్ 1995



వెల : రూ. 22-00

ప్రతులకు :
1. విశాలాంధ్ర బుక్ హౌస్
వారి అన్ని బ్రాంచీలు.
2. నవోదయ బుక్ హౌస్
ఆర్యసమాజ్ ఎదురు సందు
కాచిగూడా
హైద్రాబాదు-27.
3. నవయుగ బుక్ హౌస్
సుల్తాన్ బజారు
హైద్రాబాద్.

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్ ప్రింటర్స్
1-1-517/బి/1, న్యూ బాకారం
గాంధీనగర్
హైద్రాబాద్ - 500 380
ఫోన్ : 7611413.

# పీఠిక

కేవల కరుణరసోద్వేలిత మగు నీ యసాధారణ యోద్ధాగాథ విదేశీయమైనది. మహావీర శేఖరులగు పితృపుత్రుల విషాదసమాగమమే యితివృత్తముగా గల యీ చిన్ని కావ్యము హృదయాకర్షకమై పాఠకులను రసతన్మయులనుగా జేయు ననుటలో అతిశయోక్తిలేదు. ఇక్కావ్యము మొట్టమొదట పారశీకభాషలో ప్రకటింపబడినది. తరువాత గొంత కాలమునకు మాత్యూ ఆర్నాల్డు అను ఆంగ్లేయ మహాకవిచే ఇంగ్లీషు భాషకు బరివర్తింపబడి విశ్వ విశ్రుతిం గాంచినది. పరస్పరానభిజ్ఞు లగు తండ్రీ కొడుకుల వీరోచిత మగు నన్యోన్య సమావేశము దుఃఖాంతముగా ముగిసినది. ఇందు తండ్రి యగు రుస్తు మను జగదేకవీరుడు విజయమును బడయను లేదు - కుమార వీర పంచాననుడు సొహరాబు విజితుడును గాలేదు. తుట్ట తుదకీ యిరువురికిని సంభవించినది జీవితాంతమువఱకు నిరవధిక దుస్సహ దుఃఖభారమే. అందుచేతనే వీర కరుణ రస భరితం బగు నీయితివృత్తము కేవల కరుణ రసోత్కర్షిత మనియే భావింపవలసి వచ్చుచున్నది.

పురాణ పురుషులగు మన భారతీయ మహారథుల వీరవృత్తములలో గూడ నిట్టి యపురూప సంఘటనలు లేకపోలేదు. జైమినీ భారతమునందలి పితృ పుత్రులగు అర్జున బభ్రువాహనుల రణరంగ సమావేశము కొంచె మించుమించుగా నిటువంటిదే. కాని, యందా శూర శేఖరుల పౌరుషమును, ఆత్మగౌరవమును ప్రదర్శించి, కేవలము వీర రసమునకే ప్రాధాన్యత కూర్పఁబడినది. జైమినీ భారతమునందలి వీరఘట్టము, రుస్తుము సోరాబుల రణసన్నివేశమువలెఁ బఠితృహృద

యముల నుత్పాత లూగించు నంతటి కరుణ రస తరంగిత మైనదిగా లేదు.

ఇప్పుడీ సుప్రసిద్ధ వీరచరితమును చిరంజీవి గుంటూరు శేషేంద్ర శర్మ (బి.యే; డిప్యూటీ పంచాయతీ ఆఫీసరు) మిగుల నుత్సాహముతో మన యాంధ్రభాషయందు సర్వస్వతంత్రముగా రచించి యున్నారు. అనారోగ్య స్థితియం దున్నను మేము ఈ చిన్ని పొత్తమును మిగుల శ్రద్ధగా గొన్ని దినములు కవికుమారుని జెంత నుంచుకొని సంపూర్ణ ముగా బరిశీలనా దృష్టితో జదివి యానందించితిమి.

కావ్య గౌరవమున కర్హముగా నిందలి కవిత నారికేళపాకము ననుసరించినను ఖర్జూర కదలీ ద్రాక్షాఫల పుంజ మంజిమ నుజ్జగింప లేదు. ఇక్కవి కుమారుని కవితాధార ధారాళమై, ఇది ప్రథమ ప్రయత్నమైనను ఆరితేరిన కవితల్లజుని రచనవలెనే ప్రౌఢమై పఠన యోగ్యమై రసభావ పూరితమై యలరారుచున్నది.

దేశభాషాభిమానియై నిరంతరమును బాటుపడు నుత్సాహము గల తరుణ వయస్కు డగు నిక్కవి చంద్రు డింకను నిట్టి యుత్తమ గ్రంథములను రచించి ఆంధ్ర భాషా యోష నలంకరించుట కనువుగా ఈ చిరంజీవికి పరమేశ్వరు డితోధిక దీర్ఘాయు రారోగ్య భోగ భాగ్య ములను ప్రసాదించు చుండు గావుత మని విశ్వశ్రేయస్సంధాతయగు జగన్నాథుని ప్రార్థించుచున్నాము.

పీఠికాపురము
18-5-1954

కవిరాజహంస
వేంకట పార్వతీశ్వర కవులు

# ఉపోద్ఘాతము

నేనీ చిన్న కావ్యము యొక్క కథాక్రమానికి ప్రధానంగా ఆంగ్లకవి మాథ్యూ ఆర్నాల్డు మీద ఆధారపడినాను. సంభాషణా సంవిధానము, పాత్రచిత్రణము స్వకపోల కల్పితములు.

1947 వ సంవత్సరం నేను గుంటూరులో బి.ఏ. పరీక్షకు చదువు చున్నప్పుడు, రచనము ప్రారంభించి యిందలి పూర్వభాగం పూర్తి చేశాను. తర్వాత ఒక సంవత్సరం పాటు రచన సాగలేదు. మరల ప్రారంభింపబడి ఉత్తర భాగం పూర్తి చేయబడింది.

దీనిని సాకల్యంగా చదివి యానందించిన వేంకట పార్వతీశ్వర కవులు, కావ్యంలోని ఘట్టానికి ముందుకథ సంగ్రహంగా చెప్పడము అవసరమని సూచించినందున, యిందలి 'యవతారిక' నిటీవల పొందు పరచాను.

రచించి ఏడు సంవత్సరాలైనా ఈనాటి కీచిన్న కావ్యం వెలుతురులోనికి రావడ మనేది, కేవలం శ్రీ వేంకట పార్వతీశ్వర కవుల యొక్క వాత్సల్యమే కారణం. వారి యానందమే దీనికి ప్రోత్సాహం అయింది. వారి సన్నిధి కేగి వారి సాంగత్య విభూతి ననుభవించి యానంద భరితుడనై——

వేంకట పార్వతీశ్వర కవీశ్వరులార, పినాకినీ ధునీ<br>
పంకజ గంధ సంకలిత పాద లతాంత నితాంత భద్ర ము<br>
ద్రాంకిత భారతాధ్వరికి, తావక దివ్య పదాంబురాశిలో<br>
గ్రుంకిన నాకునుం గలదొకో, యరపీసము వాసి యేనియున్.

సంబర మాయె నేటికి, విశంకట భారత మాధురీ ధురీ
ణంబులు, రమ్య కోకనద నాథ సనాథ విభావరీ వరీ
యంబులు, మాదు సింహనగరాంత ఝరాంతర వీచికా నికా
యంబులు గాంచి, మీ హరిహరామృతమూర్తులఁ గాంచగల్గితిన్.

అని చెప్పాను.

అమయగ్రస్తు డైనప్పటికీ చాలరోజులు ఈ కావ్యాన్ని సహృద యుడై చదివి అనర్ఘమైన అభిప్రాయాలిచ్చి నాపై వాత్సల్యామృతం చిలికిన శ్రీ పార్వతీశం గారి కుసుమ పేశల స్వభావ సంపద నన్ను పులకింప జేసింది. ఆ కవులు-

కమ్మని జాను తెన్గు నుడికారపు తోరపు సౌరభంబులం
జిమ్ము గులాబి కబ్బములు జేసి, సరస్వతి తోట కంద చం
దమ్ములు గుస్తరించు కవితారస మూర్తులు, వారితోడి నె
య్యమ్ములు మర్వరాని తలిరాకుల పాకలు, తేనె వాకలున్.

ఇట్లు
రచయిత

# కావ్యాధ్వరము

శ్రీ రాకేందు యశశ్చిరంతన తనూ
రేఖా మయూఖాఢ్యు లౌ
ప్రారజ్య న్మహదాంధ్ర కావ్యసృజలుం
బ్రస్ఫార వాణీజగ
ద్ధౌరంధర్య గురుక్రియాధిషణులున్
దైవారుతన్ నాదు సం
స్కార స్ఫూర్జిత శబ్దపీఠముల మ
త్కావ్యాధ్వరాధ్వర్యులై.

# కైమోడ్పు

కింకవి ముఖతామర సై
ణాంకుఁడు, పావిత్ర్యరాశి, నానావిధ మ
చ్ఛంకాంధకార రవి యగు
వేంకట సుబ్బాభిధాను వేమరు దెలతున్.

సాహితీ సౌధంపు దేహళికడ నుండ
 బురికొల్పె లోనికి బొమ్మటంచు
కవితా వనాన సత్కావ్యసూనము లేర్చి
 మూచూడు మని కేల బుణికి యిచ్చె
ఆధ్యాత్మి కాలోచనానంద చంద్రశా
 లం ద్రిప్పి తలఁపుల సంద్ర మిచ్చె
నా యెద మోడునం దీయని భావాల
 చిగురు మొల్లంబును సృష్టి జేసె

అతఁడు సారస్వతావసధాంతిక వన
వాటికం బ్రొద్దు వుచ్చెడు తోటమాలి
బహుళ రసపాన పీన సంపన్న హృదుఁడు
మన్నమ స్సుమ విసర సంఛన్న పదుఁడు.

అతఁడు ఘనశాస్త్ర శిఖర నిష్యంద సింధు
గాహ కేళీ చికీర్షాప్రకర్ష యుక్త
గంధబంధుర సింధుర ఘటల ఱేఁడు;
వానికిం జోడు పండిత పటలి లేఁడు.

ఈ రూపాన ఫలించె, నేఁ డఖిల సాహిత్యావనీచక్ర వి
స్ఫార ప్రాభవ వైభ వాభరణ శోభా భాసు రాతీవ దు
ర్వార శ్రీగురుదేవ దివ్యకరుణా ప్రాగ్భార మందాకినీ
ధారాంభస్సులు, వారి, నా హృదయ కేదారం బుదారంబుగన్.

# అభ్యర్థనము

యమునాంబులు గంగాతో
యమునం. గంబూర గందమం దొంపెడు తో
యమునం, జేజే నాడి తో
యమునం దెల్గులను గూర్చి యల్లెదఁ గైతల్.

రాలిన పూలపై జలము రాలుచు కన్నుల వా, రెడారులం
బోలిన జీవితాల కయి మూలుగు డెందము వారలంచు మీ
కేళులఁ బెట్టినాఁడఁ దలఁ గీల్కొని మాలిమి నేలుకొందురే
లాలితిరాశినో రసికులార, మదీయ కవిత్వ కన్యకన్.

అనిశఁపు గాసికిం బొడము నగ్గలఁపున్ శ్రమవారి ధారలం
బెనిచిన నాదు కోమల కవిత్వఁపుఁ దీవియ యిన్నినాళ్ళకున్
అనిచి వెలారిచె న్వలపు నాల్గు కెలంకుల, దాని బొందగా
ననిలము గాని యా సహృదయాళి భవంబులు వీసరం బగున్.

ప్రసవ పథాలలోఁ దిరుగు భావఁపుఁగూనలు, నించు గంటుకుం
బసదన మీయఁజాలెడు సమాసములున్, మది కెంతహాయియుం
గొసరిన కొద్ది జేకురుచుఁ గొల్లగ మాదు జిలుంగు కైతలో
రసిక శిఖావతంసములు రండు కొనుండు మరంద భాండమున్.

గుజ్జంబుంబలె యానమందున హొరంగుం దాల్చి, డెందాలకున్
అజ్జాకల్ కొలుపం గటాక్షములు, మా హొర్యంగి కావ్యాంగనే
జుజ్జుం జేసి రసాసవంబుఁ గడిదిం జొక్కింపఁగా, నూగవే
యుజ్జూతల్ రసికాళి మానస చయం బుయ్యాల జంపాలలై.

లలితాలంకరణోజ్జ్వలంబును రసప్రాచుర్య ధుర్యంబునున్
జలముగ్యాన సమావహోద్భట సమాసాఢ్యంబు నౌ కావ్యపుం
గులుకుం ఘోరవిమర్శకాధమ తతుల్ గోరాడు దూరాడుచుం
గలహంసాళియ మెచ్చ నేర్చుగద గంగా భంగ సాంగత్యమున్.

చూడన్, నాయక నామధేయులు, ధనా చూడావలేప ప్రభా
వాలోకక్షయులుం, గపీశ సుకుమారైణేయ జీవాల వే
టాడన్ మానస మొప్పు వ్యాధ నిచయం బైదం యుగీనాసురుల్
నేఁ డున్నారల నాఁడె కాదు దితిజానీకం బనేకంబుగన్.

నే నేదో విరచింపఁ బూని యిపుడే నీహార శోభా సము
ద్రానన్, లేఖినిఁ బట్టితిన్, మొగిళులారా, స్వచ్ఛ తారా నివే
శానం జేరకుఁడీ విమర్శ కర కాసారంబు నారంభ మం
దే నాపై గురియింపఁ బూనకుఁడు 'వందే'యందు ముందే యిటన్.

# అమరానుబంధము

ప్రణయాపాంపతులీరు, కందలెముకల్ భావింపఁగా మీదుమై
గొనఖుం దీవెలలోనఁ గైకొని గదా క్రొందీవెనుం బోలె నా
యునికిం గూరిచె విశ్వశిల్పి; యిఁక నెట్లూహింతు భేదంబు నో
జనకా నామెయి బాఋ నల్లలును సంశ్లాఘించు మీ నామమున్.

అరవిరిఁ గేరు లేనగవులందముఁ జిందెడు మోము, తేనియల్
కురిసి ముదంబు గూర్చు పలుకుల్ పచరించుట, లంతకన్న మీ
యరమర లేని ప్రేముడియు నా కనువిందగు రూపు చందమున్
మరువగ నౌ నొకో మరతు మన్నను నెన్నిదినాలు చన్ననున్.

చెరియొక నేల యంచునకు జిక్కిన, హాయన వేయి తోయధుల్
ఇరువుర వేరు జేసిన, ననేక దినంబులు దొర్లిపోయినం,
దిరములు గాని పుట్టువులు తీరిన, దీరవనారతంబులై
ఎరుగవు కాలదూరముల నీయమర ప్రకృతి ప్రబంధముల్.

సరస కులావతంసము, విశంకట శాంత గుణంపుఁగాంతి పె
ల్లురలెడు మేలిదివ్వె, పౌడవూని చరించెడు మిన్నువాక, నా
యొరిమెను కొల్లగొన్న యితఁడొప్పునటం చెద నెంచి యిచ్చితిన్
గరువఁపు ప్రేమ కీ చిగురుకైతను చెన్నగు చిన్నెగా నిటుల్.

కబ్బ మిచ్చితిఁ గైకొమ్ము, కన్నతండ్రి
ప్రేమ మున్నీరు నీవు, నీ పేరు పుడమి
కొమ్మ రెమ్మలఁ బూవులఁ గుస్తరించి
తావి కడ లొత్తఁ దిరముగాఁ దనరుగాక!

# అవతారిక

అసిధారాలతికల్, మణిమయ కిరీటాలంక్రియా దీధితుల్
లసదశ్వంబులు, దండయాత్రలు, దిశారంగంబులం దేలు ము
న్నెనగెన్ రుస్తుము పారశీకమున నెంతే విద్విషత్ జిహ్వికా
వినరాగ్రంబుల బాహువిక్రమ రమా విస్ఫూర్తి నర్తింపగన్.

*

సురవీధి భేదించు సూయాణ ధాటితో
పొంగారు హృదయంబు సంఘటించి
నిజ భుజా యుగసార నీరాశి వీచితో
పన్నీటి జలకంబు పాదుకొల్పి
బ్రహ్మాండ విఖ్యాతి పండు వెన్నెలలతో
లలితాంశుకము తనూ లతకు గూర్చి
నవ భిండివాలాంత నఖరాంకురంబుతో
మదవైరి రుధిరంబు నుదుట దిద్ది
విజయ లక్ష్మిలలామను పెన్నురంపు
పువులసెజ్జకు మోహ రజ్జువులఁ గట్టి
తెచ్చి లాలించి పాలించి తేజ మెసగ
పురుష సింహుండు రుస్తుము పరిఢవించె.

తనవాలు దేశంబు జనపాలు నెమ్మోము
గీతకు గంటంబు రీతి గాగ
తనచూపు కెంజాయ దాయల యెదలోన
ధృతి-క్షేత్ర సంజగా నతిశయింప

తన సింహ నాదంబు తగవులో పచ్చి నె
      త్తురు వాన జల్లుల కురుము గాగ
తన మోము వెనువెంట జను చమూ వారాశి
      కలరించు చంద్ర మండలము గాగ
హయము పీపున కాపురం బనయ మెనయ
పుడమి గాలించి రుస్తుము కడిమి జూపి
జేని కరిభామినీ దహ్యమాన హృదయ
భాజనంబుల నిచ్చె నీరాజనంబు

*

క్షోణీచక్రము ఘూర్ణిలంగ నతఁ డక్షుద్రార్భటీ సైన్యుఁడై
నానా సంగర రంగముల్ దిరుగు చుండ న్నొక్కచో శారికా
వాణిం, జారు కళా విలాస నళినీ పాణిన్, మహాబంధుర
శ్రోణిం, భావజు రాణి, బోని విలస ద్రోలంబ వేణిం గనెన్.

వీణా వల్లికఁ బల్లవించి రవళుల్ పెంపారు చందాన ని
ద్రాణం బైన యనుంగు కోర్కెలు మదిం దైవార నవ్వీరుని౯
రాణం జిప్పిలు చూడ్కితీవియలతో రావించి గావించె న
య్యేణీలోచన యౌవనానలమునం దింధాన సంధానము౯.

సుందర మూర్తు లిర్వురు ప్రసూన శరాసన సాయకంబులం
గందళితాత్ములై కరము గాసిలఁ, బేశల భావ పుష్ప ని
ష్యంద మరందముం దెలసి సారస లోచన తండ్రి వారి కా
నందము మీరఁ గూరిచెను నవ్యలతా సహకార శోభలన్.

*

హసన కిసాలయంబు, లధరాధర శీధు రస ప్రసారముల్
గుసగుస పిల్లగాలు, లుపగూహన వల్లులు, నుల్లసిల్లు న
య్యోసపరి ద్వంద్వ జీవిత మనోజ్ఞల సీమలఁ జందమామయు
న్నెసకముగం, దినంబు, గురియింపగ దన్మిహికా వికాసముల్.

*

దినములు మాసరంబు లయి తీరియు తీరని తేనెసోనలై
చనగ, దదీయ వీరవరు చానకు మోమున పాండిమంబునుం
జను మొనలందు నీలిమయు సంచరణంబున భూరి భారముఁ
మొనయగ నెచ్చెలుల్ దెలిపి పోయిరి భావిశుభోదయిష్యమున్.

*

దుర మొం దేర్పడ నింతలోన విలసత్‌దోః కండువుం బందువై
కర ముల్లంబునఁ బొంగి రుస్తు మట కేగం గోరి యర్ధాంగి క
త్తైఱగుం జెప్పగ గుప్పగూలి యధికార్తిన్ నాథు కంఠంబునం
గరవల్లిం బెనవైచి కాంత వగచెం గన్నీరు మున్నీరుగా.

*

పతియునుఁ గాంత నూరడిలఁ బల్కు తలంపునఁ బొల్పు మీరగం
జతుర వచో విలాస రస సంగతి, నంగలతం గవుంగిటన్
జ తనమొనర్చి తేర్చి, సతిసమ్మతిఁ గైకొని భావ వీథిలో
కుతుక విషాద వేణికలు గుబ్బటిలన్ రణభూమికిం జనెన్.

*

కదనం బేగెడు వేళ రుస్తుము సతీ గర్భోద యోల్లాసి యై
"సుదతీ! నీ కను చిన్నిపాప కొగి నచ్చం గ్రుద్దు మీ ముద్రికన్
ముదమారంగను గొందు నాద" టనుచున్ ముద్రాంగుళీయం బిడెం
దుద కాచిహ్నము గాంచె నాతఁడు విపత్ దుర్వారకాలంబునన్.

*

కతిపయ వాసరంబులకు కాంత దృశీక వశీకర ప్రభా
తతు లొలయించు నెమ్మొగము దామరవాని యశః కృశోదరీ
సిత హసితంబు లేలు శుభ చిహ్నము లొప్పెడు రూపువానినిన్
సుతుని సొరాబునుం గనగ, శోభిలి పొంగెను బంధు సింధువున్.

*

తనకు సుతుండు బుట్టెనని తండ్రి యెఱింగిన,నొక్కఁడైన యా
తనయుని ఘోరమౌ రణ విధానము నేర్పి యనేక రంగముల్
తన వెనువెంటఁ ద్రిప్పు నెడఁ దప్పక ముప్పు ఘటిల్లు నంచుఁ దాఁ
గనినది చిన్నకూతు రని కాంతునికిం దెలుపంగఁ బంపినన్.

*

కొమరుని డెందమందు కడు గోరిన పీరున కీ యుదంతముం
బ్రమదము గాక, యుల్లమును భల్లమునుం గొని యేసినట్లులై
క్రమముగ నిల్లు సేరక విరక్తి జనించి యనేక వర్షముల్
రమణుఁడునుం బురంబులు దురంబులు నెల్లఁ జరించు చుండఁగన్.

*

పాతిక యేండ్లు బాసె. యెలప్రాయము డాసె, సొరాబు ప్రాతరా
నీత విలాస రాగ రమణీయ రుచిం దెసలందుఁ జిందు ఖ
ద్యోత కిశోరు సంపదలఁ దోచె, రణంబుల నేచె శోణిత
స్నాత పరేత జాత నటనా ఘటనా పటిమంబు శోభిలన్.

*

కాలము దారుమా రయి యొకానొకనాఁటి ప్రభూత సంపదల్
దూలి సొరాబు తల్లి తనతోడి జనంబులుఁ, గుందనంబునుం
బోలిన ప్రాయముం, దొలఁగిపోయి నిరంతర శోక వారిధిం
దేలుచు భర్తకై యెదురు తెన్నులు చూచుచునుండె నొంటిగన్.

తనయుడు తల్లి కూరటను దార్చుచు శోక భరార్తిఁ దీర్చుచున్
జనకుని జాడలం దెలియ సర్వ మొనర్చుచునుండె భండనా
వనులను గ్రుమ్మరిల్లుచు నవారిత బాహు బలార్భటిం దిశా
ఘన పటహంబులం గరము గ్రందిలఁజేయుచు నాస పెంపునన్.

*

కరకరి దాయయై విధి జిఘాంసుఁడు, తార్తర పారశీక భూ
వరు లరులై పరస్పరము భండన తత్పరతం బొనర్చు న
త్తరుణమునం, దనూభవుని తార్తర పక్షమునందుఁ జేరిచెన్
ధరపయి వాసిగన్న తన తండ్రి స్వరూపముఁజూప కెన్నఁడున్.

*

ఏకవంశ వృక్ష శాఖలం గొనితెచ్చి
కాలవేణిలోనఁ దేలఁజేసి
కరుణమాలి రెండుఁ గదిసి డీకొనఁజేసి
నవ్వుకొనుచునుండె నవ్విధాత.

*

# పూర్వభాగము

౧

సితరుచి పుంజ మంజిమలు, శీతల వాత లతా వితానముల్
శతదళ వల్లభోదయ దిశం గిసలించెను; [1]"జీవికా" ఝురం
బతను హిమావకుంఠనము నాని రహించెను; తాత్రి సైనికా
యతనము మున్గియుండెఁ దటమందున నిద్దుర పాలవెల్లిలో.

రాతిరి యంతయున్ నిదుర రాక సొరాబు పరుండి యుండె శ
య్యాతలమందు మాటి కిటు నట్టులు బొర్లుచు; నల్లనల్లఁ బ్రా
భాతరుచుల్ గుడారమునఁ బ్రాకగ వేకువ లేచి చయ్యనన్
రౌతు చొకాయిఁ గైకొని మొలం గరవాలము వ్రేలుచుండగన్.

జలజలమంచు మించి దిగజారు తుషారమున న్మ్రనింగి, పె
న్మల సిగరాలఁ గ్రాలు నొక మాసిన చిత్తరు వట్టు లెంతయుం
బొలుచు గుడారు బారుల సమూహమునం బడి యాతఁ డేగె,బె
బ్బులి పొదలందు దూరిచను పోల్కి పెరాన్విసుఁ డుండుచోటికిన్

కమలధవుండు గ్రీష్మమునఁ గాచెడు నెండఁ [2]బమీరు పీఠ భూ
హిమము గరంగఁ బొంగి ప్రవహించు నుదంచిత జీవికా తటీ
విమల తటోపకంఠమున వేనకు వేలు మరందపేటి నా
గుమురుగ దాత్రి సైనికులు గూర్చిన నల్లగుడారు లొప్పెడిన్.

1. జీవికా నది = ఆక్సుసు నదికి మారుపేరు.
2. పమీరు = పామీరు పీఠభూమి.

కొంత దవ్వగ నొక చిన్న కొండ గలదు;
కట్టి రెవ్వరొ పూర్వులు మట్టికోట
దానిపై; గాని యీనాఁడు తార్తరి సైన్య
విభుని పటగేహ మచ్చట వెలసె; నద్రి
మస్తక న్యస్త మకుటాయ మాన మగుచు.

సర్వముఁ దారు మారులుగ సల్పు జగత్పరిణామ నిర్ఘ రా
ఖర్వ మహోగ్ర ధాటి నరికట్ట నసాధ్యము గాదె, నేడు త
త్పర్వత శృంగ మెక్కినది తార్తర సైన్యపు పెన్ గుడార, మా
పూర్వుల మట్టికోట పడిపోయెను కాలవిలీన శోభయై.

ఉదధిం బోలె నశాంతి మారుతి విఘాతోల్లోల కల్లోలమై
యెద నుద్వేగము నివ్వటిల్లఁగ సొరా బేతెంచి ద్వారంబునన్
బదముం బెట్టెనొ లేదొ తార్తర చమూ పాలుండు వెన్వెంటనే
నిదురం బాసె విచిత్ర సంభ్రమ భరాన్వీతాంతరంగమ్మునన్.

చివ్వన కూర్పరంబు పయి సేన విభుం డటు లేచి శయ్యయం,
"దెవ్వఁడ వేల వచ్చితివి? యింకను నిండుగ తెల్లవారలే;
దెవ్వియు నేని వార్తలు వచింతువె, లేక యుపద్రవం బెదేన్
నివ్వటిలంగ సైన్యముచ నీ వరుదెంచితె పల్కు" మం చనన్.

ద్వారమునందు భూతల గతాఖిల విక్రమ దూర్వహాంసుఁడై
వారణ వైరివోలె నిలువంబడి యున్న సొరాబు, భూరి గం
భీరత దోచు నెన్నడల విభ్రమ సంభృతుఁడౌ పెరాన్విసా
చేరువ కేగి యీ గతి వచించెను ప్రస్ఫుట నిస్వనంబునన్

"ఏను సొరాబు. నన్నెరుగు దీవు *పెరాన్విస, తూర్పుచాన గ
ర్యాన జనింపలే దికను ఖానుఁడు; మేల్కొనలేదు వైరి సే
నా నివహంబు; గాని శయనంబున నేఁ గనుమూత నొక్కమా
రేనియు లేక వుచ్చితిని రేయిని-నీయెడ కిప్డు వచ్చితిన్.

కలనికి సైన్యముల్ 'సమర ఖండము' వీడెడు వేళ రాజు, నన్
బిలిచి సుతుండు వోలె నిను పెద్దతనం బిడి గారవించి, నీ
పలుకు హితోక్తుల న్వాని ప్రవర్తిలు మంచు వచించె గాన, నేఁ
దెలియఁగఁ జేతు నిప్పుడు మదిం గల కోరిక నో పెరాన్విసా!

పిన్నటనాఁటనే విమత భీకర తావహ శస్త్రధారినై
మున్నెపు డెప్పుడో విడిచి పుట్టిన చోటును, కన్న తల్లినిన్
మిన్నులు వడ్డచోటఁ బడి మేదిని నాథుని సేవ, ప్రాణమే
నెన్నక సల్పినాఁడ నది యెల్లను నీకును దెల్లమే గదా!

చ్యుత దళమున్ సమీరణము చొప్పున ద్రోలితిఁ బారసీకులం,
జతుర చలాంచలంబుల నశాత్రవచిహ్న జయధ్వజ ప్రచా
లితములఁ జేసినా నసమలీలను; గాని తదుగ్ర సంయుగ
క్షితులను నా కనుల్ వెదకి చిల్లులు వోయెడి నొక్క వ్యక్తికై.

ఒక్కనినే మదీయ పిత నొక్కనినే దుర మందు కంటికిం
జిక్కఁగఁ జేసికో మిగుల జేసితి నే ప్రయతంబు; నెప్పుడో
యొక్క దినాన తండ్రి తన కొక్కెడ నేనియుఁ దీసిపోని పే
రెక్కిన పుత్రుఁ గూడు ముద మెచ్చు, గదా యని గంపె డాశతో.

---

* పెరాన్విసా = తార్తరుల సర్వసేనాధిపతి.

ఆసల నుంటేఁ గాని యడియాసలుగా నవి మారె, యత్నముల్
వీసర వోయె గాన, నిను వేడెద నొక్కటి దీర్పుమో, పెరా
స్వీస! యరి స్వసేనలకు విశ్రమ మీయుము నేఁడు, నే సవాల్
సేసెద ద్వంద్వ యుద్ధమును జేయగ రండని వైరి వీరులన్.

అనిని నాయదె పైచేయి యైన యెడల
వినును మా తండ్రి రుస్తుము వీనును లలరఁ,
గాక యొరిగిన నా వ్యథఁ గాంచు తుదిని
యిలను వీడిన పిమ్మట నెవరి కెవరొ?"

అని సొరాబు పల్క నతని చేతిని చేతఁ
బుచ్చుకొని వచించె ముది పడాలు
కన్న కొడుకు మీది కన్న నెక్కుడు ప్రేమ
సానునయము లౌ వచస్సు లొలయ.

"ఓ సొహరాబు, నీ హృదయ మూరక యెంతయశాంతి గుందున
య్యా, సమరంబు నీకు పరమాదర మిచ్చెడు మమ్ము గూడుచుం
జేసి, ఫలంబు నందరను జేరి సమంబుగ పంచుకొంచు, మా
తో నకల వ్యథం దలగఁ ద్రోయుచుఁ బుచ్చగ లేవె కాలమున్?

ఒకపరి యేని నీవు గనకున్న యదృశ్యుని గోరి యీ క్రియన్
ఒకఁడవె పోరు డీకొనుట యుక్త మొకింతయు గాదు, శారికా
పికరవ గుంభితోప వన వీథుల మంజు నికుంజ సీమలన్
సుకముగనుండుమయ్య, యెద శోషిలఁ జేయకుమయ్య" నావుఁడున్.

"ఈరీతిం బరిహాస మాడు టుచితంబే బాధిత స్వాంతునిన్,
నీరాహారము లింపు గావు మదికిన్ నిద్రా సుఖం బింతయుం
జేరం బోదు కనుంగవన్, నిరతముం జింతించుచున్ శారికా
కీరా కీర్ణ వనంబులం దెటులు నేఁ గ్రీడింతు యోచింపుమా?

పారావారము లీది పోయెదను, ద్యావా కుంభినీ మధ్య వి
స్తారాధ్వంబుఁ జితం బొనర్తును, నిశాంతాకుంఠ కంఠీరవ
స్ఫార ప్రోజ్జ్వల దంష్ట్రలం జడిమెదం, జండానలాభీల కీ
లా రింఛోళులఁ జొత్తుఁ జిత్త మలరన్ లక్ష్యార్థ సంసిద్ధికై."

అని సొహరా బీరీతిం
దన యెదలో ప్రజ్వరిల్లు దావానలముం
దన దృఢతర మౌ నిశ్చయ
మును దెల్పగ నిట్టు లా చమూపతి యనియెన్:

"ఏమి యనం గలాఁడ నెటు లేనియు రుస్తుముఁ గాంచఁ గల్గుటే
నీ మది గాఢ వాంఛ యగు నేని కుమారక! దాన సుంతయున్
సేమము గాదు; శస్త్రములఁ జేకొని యాహవభూమిలో, పితృ
ప్రేమ కరంబులం దుదకుఁ బెట్టకుమా క్షతగాత్ర పుత్రునిన్.

కాని కుమార, రుస్తుమును గన్గొనఁ జాలవు నీ విటన్, 'శయి
స్థానము'నందు వృద్ధపిత 'జాలు'ను గూడి ప్రపంచ కార్యముల్
మాని యతండు కాలము సమస్తము నింటనె బుచ్చు చున్నవాఁ
డానన సీమయందు తొలుకాడ విషాదపు నీడ లేలొకో!

ముసలితనంపుఁ దాకులకు ముందటి యుక్కుతనంబు వీగెనో
వెసపడి పారసీక పృథివీపతితో కలహించి యేగెనో
యనిఁ గొని రాఁడు నేఁడు, సకలాహవభూముల వాహినీ ముఖా
న, సుడులు గొట్టి పోరుటకు నా యెలప్రాయపునాఁటి రీతిగా.

అరుగగఁ బోకు మీ వచటి కాతనిఁ గాంచగ, జంట పోరులం
జొరకుము; రుస్తుముం బడయఁ జూడు మనాహవ మార్గమందునం,
గాఁఱ యిసుమంత లేని దగు కోరిక కోరకుమా కుమారకా,
మరణము పొంచియున్నదిసుమా, వినుమా, పొదమాటువ్యాఘ్రమై.

అటులఁ జూచెద వెందుల కయ్య - నీదు
క్షేమముం గోరి నే నిట్లు చెప్పు చుంటి;
సరియ - నీ కోరు రీతినే జరుగ నిమ్ము
మ్రింగు హరిశాబకమును వారింప దలమె?

ఇక పద" మంచు సోరబు చెయిన్ విడి శయ్యను బాసి, యున్నికో టొకటి ధరించి యాత్మ శిశిరోత్కట విప్ర కృతాంగపాళి, ద్వా ఝ్మకుటము నుంచి శీర్షమున, భూధవ దండముఁ బూని, శాసన ప్రకటకు వెంట రమ్మని పెరాన్వీన వీడెను వస్త్రగేహమున్.

౨

తూరుపుఁ గొండ కొమ్ముపయిఁ దోచెను భానుఁడు, కొండగోగు ల
వ్వారిగఁ బూచినట్టులు నవారుణ కాంతులు చెట్టు పుట్టలన్
ఏరుల వాగులం గిరుల నెల్లెడ పాతర లాడె, నేడకో
బారెఁ దమో హిమా, లిసుక వట్టులు మిన్మిన లాడె నెండలో.

హయముల నెక్కి నాఁటి యుదయాన గుడారులు వీడి యందరున్
బయలునఁ దాత్తరాశ్వికులు బారులు దీరిచినారు, నిండు లే
వయసు మెఱుంగులం దనరువాఁడును, సైన్య సమస్త పాలనా
క్రియలఁ బెరాన్విసాకు కుడికేలగువాఁ డగు "హ్యామ" నానతిన్.

స్తంభోన్న తాకృతుల్ శుంభ త్పరాక్రముల్
ఆరోహి తోత్తుంగ హారి హయులు
నిజ శీర్ష భాగభా గజ చర్మ కోటీరు
లసి కుంత ముఖ శస్త్ర లలిత కరులు
పటు శౌర్య నిలయ *"ఖైవా బొఖా" రాగతుల్
మధు తురంగ క్షీర మద్య రతులు
సారవ 'జ్జీవికా' తీర సంవాసులు
రాజ రక్షాధికారాదృతులును

సైన యోధాళి ప్రప్రథమాన బారు
గట్టి నిల్చిరి వప్ర సంఘట్ట నోద్య
తోజ్జ్వ లోద్దండ వేదండ యూధ మట్లు
రణ సముత్కంఠ మనములఁ బెనగొనంగ.

---

* ఖైవా బొఖారాలు మధ్య ఆసియాలోని ప్రాంతములు.

శంకిత యోధు లజ్ఞాత సీమా సమా
గతు లైన దిమ్మరీంద్ర తతు లంత,
బిగియంగ నిడ్డ టోపీలతో చిఱుత గ
డ్డాలతో *'జఞార్స' కూలసీమ
నుండి వచ్చిన యట్టి దండి మగలు, నంత
దార్త్రియ యోధ సంతతులు నంత
నుత్తర ధ్రువ సమీపోషర క్షేత్రీయు
లౌ ఖుజుక్కులును ఖుల్మకుక్కు తెగలు

పొట్టి గుఱ్ఱాల దిరుగాడు నట్టి వార
లైన పామీరు వారలు, నంత వచ్చి
రలుగులం దుండి సీరంబు లట్లు, నాఁటి
తెల్లవారున బారి, వాకిళ్ళనుండి.

మును గాన్పించెను సీరముక్పటల మేమో యన్న సందేహ సం
జనకంబై నిబిడాశ్వికాళి యరి పక్షం బందు; వారా 'ఖొరా
సను' రాష్ట్రింపుటిలాయతీయు లనుచున్ శంకింపఁ, బశ్చాత్ స్థలిన్
స్వనిశాతాసి రుచిచ్ఛటా లసిత 'రాట్ సైన్యంబు' చూపట్టెడున్.

ఎఱుకే యీయక, చుక్క యూడిపడినట్లెంతో జవోద్వేగియై
యిరువాగుల్ కలియంగఁ బోవునెడ తా నేతెంచి పేరాన్విసా
వర రాడ్దండముతోడ సైనిక పరీవారంబు వారింపఁగా
నరి సేనాపతి కాంచి నిల్పె స్వబలా జ్యారంభ జోద్యోగమున్.

---

* జఞార్స = ఒక నది (గ్జర్క్స్)

అద్భుత వికచాంబక నీ
రోద్భవములతో విలోక నోత్సుకులై యా
వద్భుట లోకము, గతపూ
ర్వోద్భుట కోలాహలముగ నున్నట్టి యెడన్.

జరఠ ధ్వజనీ పతి జల
ధర రవమున "పారశీక తార్తరులారా,
యరి వీర వార వారి ము
గురుమారుత మౌ సొరాబు కోరిక వినుఁడీ!

పగతులలో నెవ రేనియు
మగటిమి గలవార లైన మానక తనతో
బిగు వెగయ జంట కలనికి
దిగుఁ డని పిలిచెన్ సవా లిదే యని" తెలుపన్.

తలిరుం గోళులఁ గ్రొత్త ప్రొద్దు గిలిగింత ల్వెట్టఁ బల్వన్నె న
వ్వుల నొల్కించెడు మంచుబొట్లు, కొసలం బొల్పారు లేబైరుపై
వలపున్మోపరి మందవీచి చను నెబ్బంగిం బ్రభాతాన, న
ట్లలమెన్ సాద్భుత మోద వీచి వెస డార్టార్ సైన్య వారాశిలో.

పలుచోట్ల గ్రుమ్మరి విలుచువారల బారు
కాబూలు నగరంబు కదలి వచ్చి
మించి మిన్నొంచున్న మంచు కొప్పుల వొప్పు
[1]హిందూ కుష చలంపు టిరుకుదార్ల

1. "హిందూ కుష్" పర్వతాలు.

నెది చేయ నేమగు నేమొ య స్వైరపునఁ
గడిది నీర్వట్టుకు గజ్జురంబు
నేని యించుక నోట నిడ సొల్లకే మెల్ల
మెల్లగాఁ జనుతజి మీద నొక్క
పృథుల హిమ సంహతిసి గన్న వేళ వోలె,
సాటి యేకడ లేనట్టి మేటి జోదు
పేరు విన్నంత పార్సిక వీరులందు
పోయె శ్వాసానిలంబులు వుటుకు మంచు.

తోడి పడాళు లంత వెఱతోఁ జని పార్సిక వాహినీశునిం
గూడిరి భావి కార్యమును గూర్చి తలంపగ; బల్కె నీగతిన్
[1]గూడురు, "జా సొరాబు కొనగోటికిఁ జాలఁ డొకండు నేని పో
రాడఁగ నీబలంబున గలట్టి సుయోధుల," నంచు, వెండియున్.

సింగపు గుండెవాఁడు, [2]మృగశీఘ్రపదుండు, సొరాబు, వాని డా
యం గలమే? యవజ్ఞ యగు నౌదల వంప, సవాలు గైకొనన్
శృంగ విభంగమౌ, నొకటి చేయుద మీయెడ; రాజుమీద న
ల్కం గొని రుస్తు మిప్పు డెడగా వసియించుచు నుండె సేనకున్.

ఇచటి కతండు నిన్నటి రెయిం జనుదెంచెను; వాని వీనులం
దచటికిఁ బోయి వైతు రణ మాగుట గాఁగల సర్వవార్తలం
బ్రచుర పరాక్రముం డతఁడు వైరి విజృంభణమున్ సహించునే
యచలిత బుద్ధి; గాన గొనినట్లు సవాల్ ప్రకటింపు డిత్తఱిన్".

1. గూడురుజు, గూడ్రుజు, లేక గుడూర్జు = పారసీక దండనాథుఁడు.
2. పాదలాఘవముతో జంట పోరునందు మెఱుపుతీగవలే, కురంగి భంగివైరి ప్రయోగములు తప్పించుకొనుచు పోరుట; - విజాతీయము.

నావుడు, "నిట్లు చేయఁదగు నంచు ఫెరూదు వచించెఁ బ్రస్ఫుటా
రావముతోడ తార్తర బలాళి మొగం బగుచుం "బెరాన్విసా!
నీ వనినట్టులే రణము నిల్పి సొరాబును శస్త్రధారునిం
గా వెసఁ జేయుఁ డంపెదము గాంచి యిదే తగువాని నేమునున్."

అంత ననంత సాగర సమాతత తార్తర వాహినీ నికా
యాంతర కల్పితాధ్వమున నాత్మ నివానము దిక్కుగాఁ జనెన్
శాంత మతిం బెరాన్విస; వెసం జనె గూఢ్రుజు దూర సైకత
ప్రాంత పటాలయంబునకు నాత్మఁ గలంగుచు రుస్తుముం గనన్.

*　　*　　*

# ౩

అరుణ పటాలయంబు లవి యప్పుడ గట్టుటఁ బ్రొద్దు టెండలో
మెరయుచు నుండె; నన్నిటిని మించిన రుస్తుము గీము చుట్టునన్
వరలును సేవకాళి వటు వచ్చి యెకాయెకి గూఢ్రు జున్న తాం
బర నిలయంబుఁ జొచ్చె నసమాన పరాక్రము రుస్తుముం గనన్

నిద్దపు దోసపండ్లు, రుచీ నింపెడు రొట్టెలు, గొఱ్ఱె మాంసముం,
బ్రొద్దుటి బోన మాఱి యుడి వోయెను వేడిమి ప్రక్కఁ బీటపై;
నెద్దియుఁ దోచకున్కి గర మెక్కిన శ్యేనముతోడ నాడుచుం
బ్రొద్దులు పుచ్చుచుండె నట రుస్తుము బోనము నుజ్జగింపుచున్.

అచటికి వచ్చి నిల్వఁబడె నప్పుడు గూఢ్రుజు; వానిఁ జూచి యా
ఖచరముఁ గ్రింద జాఱవిడి గ్రక్కున కేకను వెట్టి లేచుచుం
బ్రచుర ముదంబునం బొదివి పట్టెఁ గరద్వయి రుస్తు మాతనిన్
విచికిల దంత దంతురిత పేశల హాస విభాసి తాస్యుఁడై.

“ఎంతయు సంతసంబు నొదవించెఁ ద్వదీయ సమాగమంబు, నా
కింతకు మించి చూడ నిక నెద్ది ప్రియం బగు దృశ్య మౌను, వి
న్పింతువె వార్త లెవ్వి గల వేని - సరే మును గూరుచుండి, యొ
క్కింత భుజించి త్రావు”మని యెంతయుగారవ మొప్పఁబల్కినన్.

వాకిటనే గుడూర్జు నిలుపంబడి, “గైకొన నొల్ల కుంటి న
నోర్కుమ మిత్రమా, కుడిచి కూర్చొన కాలముగాదు; వచ్చితిన్
నీ కడ కొక్క ముఖ్యపుఁ బనిం గొని; యచ్చట సంగరావనిన్
ఘూకల వీడి యొండొరులు మోములు గన్గొన విస్మయంబునన్.

కలనికిఁ దలఁపడు శల్లా
గలగుండు వడన్ స్వసైన్య గణము, విపక్షుల్
పిలిచిరి మన వీరుల వా
రల సోరబు తోడ ద్వంద్వరణ మొనరింపన్.

ఎరిగియె యందు వీ యువకు నింతకు మున్నె; తదీయ వంశమున్
మరు గొనరించినా రరులు, మాన్య త్వదీయ పరాక్రమానికిన్
సరియగు పూఁపునేపున నెసంగెడు సింగపు గుండెవాఁడునుం
గరువలి వారువంపు వడి గాశులవాఁడు సుమా! సొరా బనన్.

పారసిక భటులు సంగర
ధారుణి సోరాబుపైకిఁ దలపడు పెల్లం
గోరాడఁ గోరి తగ రాక
స్ఫారాద్రిని డీకొనంగఁ జనుమాడ్కి యగున్.

రాయి సొరాబు కాయ మెలప్రాయము గావున వాని ధాటికిం
బ్రాయఁపుఁ బ్రొద్దు గ్రుంకిన యిరాను పఠాణులు చాల రొట, నీ
యాయత విక్రమంబుపయి నాశలు నిల్పితి మోయి, గాన నీ
వీ యెడ వచ్చి పోరగదవే, పద, వేడెద, వేగమే" యనన్.

చిరునగ వొప్ప రుస్తుము వచించెను, "వృద్ధులిరానువారు, నేఁ
దరుణుఁడ నౌదునా సమరధారుణికంపగ, పిన్నవారలౌ
జిరుసరదార్లకే గలదె చేవ? యదేమొకొ రాజు వారికే
గర ముపయుక్తు లంచు నతి గౌరవ మిచ్చుట చిత్ర మయ్యెడిన్.

ప్రాయఁపువాఁడు గాన నెలప్రాయపు జోదుల గారవించు భూ
నాయకుఁ డైన 'ఖైఖుసురు'; నావలె నుండెడు పెద్దవారలం
బోయి తయారు గండు కనఁ బోయెడు చావున కన్న రీతి చూ
చాయఁగఁ జూచు; నేఁగు డిఁకఁ జాలు; ప్రియంబగువారిపొంతకే.

పొరి పొరి దాయ యోడు పొడుపుం బలుకుల్ పురికొల్పునప్పుడే
యురవుగ పోరునందు పురలో మగ పోరగలార లెవ్వరేన్;
జర యరుదేరఁగా నుడుకు చచ్చిన నాదు యెదన్ జనించునే
చురుకుఁదనం బొకించుకయు 'సోరబు' పిన్నతనంపుఁ బల్కులన్.

ఆతం డెంతటి మేటి యైనను తదీయ ప్రాజ్య కీర్తి ప్రభా
వ్రాతం బుర్విని తొప్ప దోచినను నేలా నాకు కన్గుట్టు; నీ
భీతైణాక్షిని గాక తాదృశ మహా భీమాజి భూమీజపా
పాతోద్యాన విఖేలన ప్రియ సుతావాప్తిన్ మదిం గోరెదన్.

సోరాబుం బలె వార్త కెక్కిన లస త్సూనుండు నా కున్నచో
పోరాటంబుల కాతనిం బనిచి నే బోదుంగదా, రాజ్యమున్
హేరాళంబుగ దోచు దోపరులతో నీ వార్ధకం బందునన్
మారాటంబులఁ గుందు నా జనకునిం బ్రాపిచ్చి పోషింపఁగా.

ఇట్టులు గాక నా కబలయే తొలిపుట్టువు పేద చెయ్యువలం
బుట్టె సరే - ఇఁకం బొగులఁ బోవను దానికి నా యశస్సుచే
చుట్టును కంచెఁ గట్టి జర స్రుక్కిన తండ్రిని గాతు నీపయిన్
గొట్టుక చావనిమ్ము జగకూళల నేలికలం గృతఘ్నులం."

ఇట్లంచు నవ్వు మొగ్గల
జిట్లింపుచు నూరకున్నఁ, జింతిలి యనుకొ
న్నట్లాయె నంచు 'గూడురు'
జెట్లో యొప్పింపఁ గోరి యిట్లు వచించెన్:

"చేవం దీవెకు పట్టు గొమ్మవును మాస్టీలందు మేల్బంతివిన్
ఆవాసంబవు కీర్తికాంత కని యాహా బుట్టి కయ్యానికిన్
నీవే-రమ్మని పిల్వగం బగఱు చన్నే నీ విటుల్ డాగఁగా
నేవం భూత భవత్పరివర్తనకు తా మేమంద్రు లోకుల్ సఖా?

నీచత లోభివాఁడు జన నిందకు సైచి గడించినట్టి కా
ణాచిని డాచినట్లు, యువనాథులపై మది పొర్లు నన్ను సం
కోచము పైకొనన్ వెరచి, కోరక పోరిక, గెల్పుదొయ్యలిం
డాచ గడంగె నీతఁ డని డప్పులు గొట్టుచుఁ జాటరే యరుల్!"

ములుకులు వోని పల్కు లివి మోమున నాడుట బిట్టు గుట్టగా
నల్క దలిర్ప, 'నాపు మిఁక నానుడు లింతకు మించి మంచివౌ
పల్కులు రావొకో, పిరికి పందలతో నను బోల్చి చేయుదే
చులకన మద్యశో గరిమ చొప్పున' కంచును రుస్తు ముగ్రుఁడై.

పోరం దొడ్డని సడ్డ సేయఁ జన, బూఁపుం జూడ నేపాటియుం,
బేరుం గీరులఁ బూరికిం గొనను, విద్వేషింధనోషర్బుధా
కారం బే నని నీ వెఱుంగవె - కృతఘ్నక్ష్మాపతి ప్రీతి కె
వ్వారల్ జీవము లిత్తు రన్న దొకటే బాధించు స్వాంతంబునన్.

చింతా కంత మదంతరంగము జయశ్రీ నష్ట శంకార్చి సం
క్రాంతావస్థను బొంద దోయి - యిఁక నేలా వ్యర్థ వాగ్డోరణుల్
భ్రాంతిం బాయుము రమ్ము చూచెదవు మద్బాహుప్రకాండాతి దు
ర్దాంతాకుంఠిత పాటవంబును సమిద్ధాత్రీ తలం బందునన్.

చేతు రణంబు; గాని యొక చేతికిఁ జాలని బాలు మీఁద ని
య్యాతత కీర్తిశాలి పడి యాలము సేసె నటన్న మాటకున్
నాతల యొగ్గఁబోను మరణంబునకున్ మును; గానఁ జేతు న
జ్ఞాతుఁడనై రణం,' బని బుసల్ విసరెన్నురగంబు బోలికన్.

వాకిటికిఁ బోయి రుస్తుము భటులఁ బిలిచి
యాయుధంబులఁ దెమ్మని యాజ్ఞ సేసి
తద్భటానీతములతోడఁ దడయనీక
యుద్ధ వేషముఁ దాల్చి సన్నద్ధుఁ డాయె.

౪

విడిచెను స్వాంక ధారణము, వీడె నలంకరణ ప్రకర్షయుం,
బొడవుగ జాజు వన్నె నెఱి ప్రోవులు ప్రేలు కడాని సీసకం
బిడెను శిరాన, రుస్తు మని యే యరికిన్ విదితంబు గానటుల్
వెడలె నతండు స్వాలయము వీడి బిరాన నయోమయాంగుఁడై.

జవము పెట్టని తొడవుగా సవదరించు
రక్షకీ నామ హయ మంగ రక్షకముగ
నధిక విశ్వాసవ చ్ఛ్వాన మట్టు లప్పు
డా ఘటాగ్రణి వెన్వెంట నరుగుదేరె.

మును సూయాణము జేయనేఁగుతఱిఁ బొల్పొంగుల్కు గుబ్బింపుగా
నను మాత్రంతిక సీమ గ్రేళ్ళురుకుచుండన్ నిర్ఝరీ కూలమం
దున వీక్షించి, ప్రతీక సౌష్ఠవము, బిహాన్నెత్కృష్టతాభూతియున్
మనముం గిల్పుకొనంగ రుస్తు మతిప్రేమం దెచ్చె నద్దానిన్.

ఇచ్ఛక మాడుచుం గలసిఁ యెక్కువ మక్కువ యుంచి పెంచుచుం
దెచ్చిన యశ్వశాబమును తీరిచి దిద్దెను పెద్దదానిగా,
హెచ్చుగ నెర్రజూలు నిగుడించిన పెన్మెడపైన ప్రేల, తీవియే
వచ్చి యిటుల్ జనించె నన వారువ మొప్పును నేఁడు గొప్పదై.

చెలువుగ మేన నిడ్డ పలు చిత్తరువుల్ బెడగారు పుట్టపుం
జిలుగు బసిండి కుచ్చెళులు చిందులు ద్రొక్కఁగ బ్రక్కలన్, నడ
ల్దొలుకహొరంగు, పెక్కులుగ దూరపుఁగోనల మారుమ్రోగు గా
థలు గల నా హయప్రభువు, తద్దయు నర్మిలి వెంట నేఁగఁగన్.

దవ్వుల రుస్తుముం గని ముదంబున డెందము లుబ్బ, దిక్కులన్
నివ్వటిలంగ మోద భర నిస్వనముల్ చెలరేపి రెల్లరున్
నవ్వుమొగాలఁ బార్సికులు నట్టువ మాడుచు; విక్రమంపు పెన్
దివ్వె వెలుంగులోఁ బొలిసె నిట్టలపుం బయిలోట చీకటుల్.

కడలి మునింగి ముత్తెములఁ గట్టుకు దెచ్చెడు దాఁక మింటికిన్
బుడగ నురుంగులం దెరలి పొంగులు వాఱు కరళ్ళఁ జూచుచున్
జడుపును బొందు నాలు తన జాలరి చెల్వుఁడు పైకి వచ్చినం
గడిది ముదానఁ గాంచు గతిఁ గాంచిరి వానిని బారశీకులున్.

కూరిమి చూపు పూవులను కొల్లగ నెల్లరు జల్లుచుండ నీ
హార నగాధిరాజు వలె నాహవరంగము నంతకంతకుం
జేరఁగ వచ్చె రుస్తు మవిజేయ పరాక్రముఁ; డావలం - బ్రబా
తారుణు బోలెఁ దత్సుతుడు తా ర్త్రినివేశమునుండి వెల్వడెన్.

ఎవ రయి యుండ నోపు నని యెంచుచుఁ, బోరుల దొడ్డజోదులం
థవథవ పెట్టుచుం బితఁ గనన్ రణభూములఁ గ్రుమ్మరిల్లు న
య్యువకుని జూచుచు న్నిలిచె నూరక రుస్తుము కన్ను లార్పకే
యివి యని చెప్పరాని వుదయింప మదిం బదివేల భావముల్.

పొలపము మార్దవంబు బొడవుం గని యంతిపురంపు దోఁటలోఁ
గలకల గాలికిం జలము కమ్మగ బల్కు కొలంకు గట్టునం
గలువల తేని కాంతిఁ గులుకాడు తృణావనిఁ జిన్ని నీడలం
గిలికెడు కన్నెమావి మొలకే సొహరా బని దోచె తంద్రికిన్.

శూర వరీయమున్ శశి కిశోర సిత ద్యుతి పుంజ మంజులం
బా రమణీయ మూర్తిఁ గని యక్కటికం బెదయందుఁ జొచ్చినం
జేరఁగ వచ్చు పట్టి కిటుఁ జెప్పఁగఁ గోరి కరంబు నెత్తఁగా
వీరుఁడు తండ్రి దోచె నొక విన్నును దాకెడు తాడి కైవడిన్.

'ఓ తరుణుండ రమ్ము, సమరోర్వికి వచ్చితె? యక్కటా! భవత్
చేతము గీరుటం గలను సేతకుఁ బొమ్మని, నిన్ను నేఁడు చేఁ
జేతనె జంపఁగా వలసెఁ, జేయున దేమిఁక - చావుసింగపున్
వాతఁ బడంగఁ గోరి యిటు వచ్చితి వెంతటి పిచ్చివాఁడవో!

చిలుకలు గోరువంకలు వసించెడు తావులు గావు, మావులం
గల కల కోయిలల్ సభలు గట్టెడు పట్టులు గావు, పూలపై
వలపుల పాట తేటులకు వాటిలు చోటులు గావు, నల్లలం
దొలకెడు నేల లివ్వి, యిటఁ ద్రోయకు నీ సుకుమార రూపమున్.

మరణ భయంక రాకృతిని మానసమందున నెంచి చూచినం
గరుణ యొకింత యేనియును గానఁగ రాదఁట; కాదు కాదు తత్
ఖరతర నాసికానిల నికాయము చందన గంధవాహముల్
ఉరు దశనాంత కాంతి తతులో యువకా మిహికా వికాసముల్.

నీ పాలవంటి పరువము
నీ పైడిని కొంచెపరచు నెమ్మె నెదిరిం
గాపాడు టెఱుంగని నా
పాపార్ద్రి కరంబులందుఁ బడ వ్రేయకుమా!

బాలుండా! యిటుచూడు మోయినను శుంభత్ స్తంభసంకాశుండం
గేశీ భూతరణుండ, నిల్చితిని పెక్కింటన్ రణాలందు; లే
దాలం బందున నోహటించుటయు, దాయన్ వీడు టేనాఁడునుం;
బోలుం బోలము లెంచవైతివి గదా పోఁగాల మేతెంచుటన్.

హరిదంత దంతిరా డురు దంత పరిదంతు
రిత వైరి నుతి, బాహు తత బలంబు
ఉడురంగ రంగ ధృహుళ తుంగ గిరి శృంగ
పరి భంగకరము, దోశ్శిర విధంబు
అసమాన మానసౌకస మాన హసమాన
లసమాన, మరి భీకృదసి యశంబు
జయ బంధు రాలోక చయ సుంద రేందీవ
రేందీవ రాసనాయిత, మురంబు

సతత నిర్ఘోషి తేతర సామ్య రహిత
మహిత దుర్ధర్ష ఘోర సమ్యగ్గభీర
పరబలాంభోధి కుంభసంభవ సిభంబు
బాలకా! మామ కాహవ ప్రాభవంబు.

చావున్ రమ్మని పిల్తు వేల యువకా, చాలింపు మాయత్నమున్
భావం బందున నెంచి, తా ర్తరుల సంబంధంబు బోఁద్రుంచి నా
యావాసానికి రమ్ము, నా సుతుఁడవై యస్మత్ ధ్వజచ్ఛాయ నా
జీవం బేగెడు దాఁక పోరుము జయశ్రీ నిత్య కాంతుఁడవై."

వారిద ఘోషకుం బురుడు వచ్చు గళస్వనమున్ వినెన్, దదా
కారము నారసెన్ సుతుఁడు; కాంచెను కానల చెట్ల సందులం
దూరి తమోవృతావనుల దుంపెసలాడు వెలంది వెన్నెలం
గేరుచు మొల్కలెత్తు సిత కేశములం దల నచ్చటచ్చటన్.

అనుమానం బెద నంకపొంకములుగా నావిర్భవం బందినన్
జనకుం డాసి రయంబునం బొదివి తత్ జంఘా ద్వయిం గౌఁగిటం
దనయుం, 'డో మహనీయ, కీర్తిపరిధౌతాశాంత పర్యంతుఁడున్
యినతేజుండును నైన రుస్తుమువు గావే, తెల్పవే, తెల్పవే'
యని వేడం దలపోసె నిట్లు జనకుం డాత్మం బరాచీనుఁడై -

ఔరా, వీఁ డెదలోనఁ బన్నె నెదియో నారీతి గాకున్నచో
పోరాటానికి రాక, నన్, బొగడఁగాఁ బూనం గతం బే మొకో,
యూరూరం జను లాడుకొంట వినమే, యుత్కోచు లాత్మస్తుతిం,
బారిఁబల్ కుహనా వినీతి ననుచుం బల్తార్త్రి తారుణ్యులన్.

ఇప్పుడు నిక్కువంబు వచియించితి నేని, జయంబు వీనికిం
జొప్పడు పెల్ల మింటిపువు చొప్పని తెల్లము గాన, నాలముం
దప్పగ నిచ్చి, నాదు భుజ దండ బలోన్నతి నుగ్గడించి, కొ
డొప్ప సమాను నట్టు లెదియో యొక కానుక నిచ్చి యేఁగడే?

ఏగినయట్టిఁ డూరకొనునే, సభలం బొగ డొందఁ గోరి, 'నే
నేగితిఁ బెక్కుకయ్యముల కింతకుము న్నొకనాఁడు రుస్తుమే
యాగఁగలేక మత్పటిమ, కాపగ బోరు, సమాను లేగు న
ల్లేగితి మిచ్చి పుచ్చుకొని యెవ్వియొ కాన్కల' నంచు వాగఁడే?

దానఁ జేకురుఁ దలవం పిరాను యోధ
గణములకు నెల్ల నావల్ల గనుక; నిజముఁ
గప్పి పుచ్చెద నని యెంచి యిప్పగిదిని
బల్కె రుస్తుసు కర్కశ స్వన గళాన.

'లెమ్మిఁకఁ జాలు కైతవము లెమ్మర రుస్తుమువా యటంచు, నీ
విమ్మెయిఁ గోర నేటి, కొనరింపుము కయ్యము, లేక యోటమిం
గ్రమ్మరనియ్యకొమ్ము, నుడులంగొఱయేమి, యెదుర్పవేమొ యు
ద్ధమ్మున రుస్తు మొక్కరుని దక్కఁ దదన్యుల నోరి యుద్ధతా!

నిరుపమ విక్రమాంశు చయ నిర్జిత విద్విష దంధకారుఁడై
వరలెడు రుస్తు మన్ చటుల భాస్కరునిం గను లెత్తి చూడలే
రరులు రణాన; నేఁడు భవదగ్రమునం గలఁ డంచు చెప్పినన్
దురము గిరం బటుంచి నిను ద్రోలదె మున్ వెను భీతి బాలకా!

అట్టిఁడఁ గాక నీవు గను నట్టిఁడ నైనను నాదు మాటలం
గట్టిగ నమ్మ మోఖుడుత, కయ్యము మాని గ్రహింపుమోటమిన్
అట్టులు చేయ వేని భవదస్థిక లెండల నెండి యిచ్చటం
గొట్టుక పోవు నీట నది కూలము బొర్లగ మండువేసవిన్.

అని పల్కఁ తోకఁ ద్రొక్కిన
ఫణి ఫణితి చివాల్న లేచి బాఢామర్షా
రుణ దృక్కుల రుస్తుముఁ గని
యనె నిట్లు సొరాబు వికట హాస ముఖుండై.

'నీ వంత భయంకరుండవె?
యావంతయు నాదు కనుల కట్టులు లేవే?
యేవో మాటల భీతుని
గావింపఁగ నాడుదానిగా నెంచితివో?

విని విని వీను దోయి పరివిద్ధము లాయె; స్వకీర్తి దుందుభి
ధ్వనిత కళా ప్రదర్శనము తా మిఁక యాపుట లెస్స; యాజిలో
నిను తల దన్నువారు ధరణిం గల రెందఱొ; బాలు నట్లు నన్
గనియెద వేల నీ వొక జగా మొనగాఁడవుగా యెగాదిగా.

నిక్కువ మోయి నాయెదుట నీ వనినట్టులె రుస్తు మున్నచో
నక్కట నాకు చేతు లెటు లాడు దదీయ పవిత్ర మూర్తినిన్
ముక్కడి వోలె శస్త్రముల మొత్త గడంగుట; కట్టు లౌట నిం
కెక్కడి సంగ రాచరణ మియ్యది వాని సమక్ష మైనచో.

కండలు నిండు పోటు మొనగాఁడవుఁ సంగర కౌశలుండవున్
గండుబులేనియున్ సవతు గాని భయంకర విగ్రహుండవున్
బెండువు గా వటంచు నిను బేర్కొనెదన్ మదమత్త యోధ, య
ట్లుండియు గయ్యమందు గెలుపోటము లెప్డు దురూహ్యముల్ గదా!

తావక హస్త కీలితమె తప్పదు గెల్పని నొక్కి చెప్పగా
నీవును నేను దక్కు ధరణీ నరులుం బవమాను పన్నునం
బోవు కృపీట వాహముల పోల్కి విధాతృ వశానువర్తులే
కావున నీవు గోరు గతి గా దెపు డేనియునం చెఱుంగుమా.

జరిగిన వెన్క నిక్క మనఁజాలుదు మంతియగాక యెవ్వ రే
నెరుగరు భావికాల మిదమిద్ధ మటంచు; భవాంబు రాశిలో
కర డోక డంబరం బొరయగా మనలం బయి కెత్తె దూరపుం
దరి బడవైచునో ప్రచుర దారుణ నీరధి పొట్టఁ బెట్టునో.'

హరి శాబ శోభి సుతుఁ డి
ప్పరుసునఁ బల్కంగ మారు బల్కక జనకుం
డురగేంద్ర నిభము కుంతయు
గిర గిర గిరఁ ద్రిప్పి ద్రిప్పి కేల న్విసరెన్.

రివ్వునఁ గుక్కుటార్భక పరిగ్రహణార్థము వాడిచూపుతో
దవ్వుమొయిళ్ళనుండి యిలఁ దాకు శశాదన మట్లు తండ్రియే
రువ్విన వచ్చు యీటెను విలోకన చేసి మెఱుంగు కైవడిం
జివ్వున ప్రక్కకుం దొలఁగె; చెచ్చెర యుద్ధ విదగ్ధ సూనుఁడున్.

మెరమెర లీను నీటె పుడమిం బడి రేపెను ధూళిపాళి; ధీ
వరుఁడు సొరాబునున్ క్షణ విభా నిభ కుంత మనంత వేగమై
బరవఁగ నైవ రుస్తుమును బాయక తాకెనె గాని, వెంటనే
ధరఁ బడె భూరి కంకటక దారుణ ఘట్టన కుంఠితాగ్రమై.

అంతం గుంతా హతికిన్
సుంతయుఁ జలియింపకుండ శుంభత్ భూభృత్
కాంతుని బలె రుస్తుము దు
ర్ధాంతోద్ధతి మిన్ను ముట్ట రక్తాక్షుండై.

కేలన్ భీకర శాఖను
గీలించి సొరాబు పీదికిన్ వైవంగా
నాలంపు దిట్ట యతఁడున్
లీలం దప్పించుకొనియె రెండవమారున్.

గురి బాయంగ తదాయుధంబు వెస నిర్ఘోషత్ పవిం గేరుచున్
ధరపైఁ గూలెడు లోననే, తనయ శస్త్రాఘాత దేహావనీ
ధరుఁడై రుస్తుము ద్రెళ్ళి ఫెళ్ళు మని నేత్ర ఘ్రాణ కర్ణంబులం
జొరగన్ వాలుక నేలకుం దొఱగినన్ సోరాబు చేరం జనెన్.

సాటియె లేని రుస్తుము రసాగతుఁడై తన కేళ్ళు వాలుకన్
గాటము గాగ గ్రుచ్చి, పెనుగాళులఁ జాపి, నిరస్త్రుఁ డౌట చే
వాటున నున్న దాయఁ గరవాడిగఁ జూచుచు నూరకున్న, య
ప్పాటున నెంత, దారుణ కృపాణము పాలొనరించు టాతనిన్.

అతి కరుణాంతరంగుఁడు, నుదార గుణాఢ్యుఁడు నైన యాసొరా
బితరులవోలె వర్తిలక, యీ గతి వైరి కరస్థుఁడైన కు
త్సిత మొక యింత లేక యొరఁ జేరిచి వాలును, లేశ హాస భా
సిత వదనాబ్జుఁడై యమృత శీకర తుందిల మంద భాషియై.

సంబర మాయె నీ ప్రథిత సంగర పాండితి; కాయుధ ప్రయో
గంబును లెస్సగా నలువఁ గల్గుదువే! యది నన్ను దప్ప న
న్యంబులనెల్ల దాకు; నహహా! యిఁకలెమ్ము, వృథాక్రుధన్ మనో
బ్జంబున పీడు, లే దది నిజానికి నాయెదలోన సైతమున్.

అవురా! పొఱును దూరదూరముగ నేలా నిన్ను గన్నంతనే
లవమున్ లేక యెడంద పీడి యలుకెల్లం బంచబంగాళమై;
యెవరై యుందువొ తేనెగిన్నియనుగా నీరీతి నా యుల్లమున్
సవరింపంగ - నదేమొ రుస్తుమును నేనా కాను కా నందువే?

తోచెద గాని నీకపుడ దోచిన కందుగ, వంద యాజులం
జూచితి, వాని యుగ్రతర శోణిత భంగము లందుఁ దేలితిన్
నా చెవులార వింటి మరణ వ్యథితాత్మ విలాప గీతముల్
యేచిన గుండె నిబ్బరము నేదిన దేదిన మేని యున్నదే?

ఈనాఁడే నినుఁ జూచి యబ్బురముగా నేవో వచోఽతీతముల్
నానా సూన సమాన భావ చయముల్ నా మానసావ్యక్త వీ
ణా నాదంబులు పుట్టె; శాంతియ మదంతర్వాణి యాదేశమో,
మానంగాదగునయ్యయీ యని; వయోమాన్యుండ వూహింపుమా!

రోసముఁ బాసి, ప్రాసములఁ ద్రోసి చరింత మనంత శాంతి కాం
తాసుఖ లాస్య రంగ సికతా మయ సీమలలో సుధా సమా
నాసవ మానుచుం దొలి రణంబులఁ గూరిచి ముచ్చటించుచున్
రోసము మిన్నుముట్టి మొగిలుం గవ డీకొని యేక మైనటుల్.

కోపమ మామకీన జనకోపమ, నాపయి? మూపు తీంట్రముం
బాపఁగ నీకుఁ దార్తరులఁ, బార్సికు లందున నాకు నెందఱో
జేపడ వచ్చుఁ గాన రణ చింతను వీడి, యొనర్త మాత్మలం
బ్రాపిడి యల్లి బిల్లి యను మల్లియ తీవెలఁ బల్లవింపఁగా."

పొందును గోరి లోన పొరపొచ్చెము మందున కేని లేక యీ
చందపు గంబురాపొడి పచారము లొల్కెడి మొల్క పల్కులన్
నందనుఁ డాడుచుండు తరుణానఁ, దటాలున లేచి కుంతముం
బొందెను రుస్తు, మంతటనె బొందె పురాపరిఫుల్ల తేజమున్.

కరమునఁ జేరి ఘోరముగఁ గ్రమ్మఱ, విప్లవసూచ కాగ్రమై
మెరసెను ధూమకేతువును మీఱుచు కుంతము; దూసరంబులై
దర గత కాంతులై యతని దంశన శీర్షకముల్ నతీకృతుం
ఢెరుగుఁ డితం డటంచు వచియింపకయే వచియింపుచుండఁగన్.

పొంగెను వెన్నురం బుదధి పోలిక, మోవుల దాటి నుర్వు లు
బ్బంగఁ దొడంగె, ద్రొబ్బువడి వచ్చిన గిబ్బకు చాడ్పునన్, వచో
భంగము వాటిలెన్, విరియఁ బారెఁ గనుంగవఁ గెంపు గుంపు లు
త్తుంగ ఫణాహి మీరెను క్రుధోదయముం గని రుస్తు మెంతయున్.

హద్దెఱుఁగని కాతాళపు
ముద్దర వడి చుఱుకుఁదనము పొంపిరి వోవం
దద్దయు ములుకులకుం బె
న్నుద్దులు నుడు లెట్ట కేని నోటిం దాటెన్.

"ఓ తటిదంగి, చెంగు మని యోసరి దూసుక పోక నీకు నే
రీతి నుదగ్ర దోర్బల పరీక్ష నెదుర్కొన లావు జాలు; నీ
చేతులు వోయెనే - దురము చేతకు కాల్గిలు పేల మాటికిం?
బాతర లాడి, నీకు మగపాడియ లేదన వచ్చు నెంతయున్.

కయ్యంబున నెయ్యం బని
తియ్యంబులు, వెయ్యి పార తేనియ సోనల్
యొయ్యొయ్యన వినుతువు, మది
నుయ్యాలం బెట్టి యూతు వోరి దురాత్మా!

పూత పసిండి వోని నుడి పోహణ జేతువె గాని, యాజి నీ
చేతయ గాదు; మంజు వనసీమల కోమల కామినీ పరి
వ్రాతపు వాతెరల్ గొరికి భాసిలుటే యనుకొంటి వేమొ, యు
ద్యాతత దోర్బలాఢ్య నిచయంబులతోడ రణంబు సైతమున్.

చీ మఱొక్క మాఱు నీ మరల్ గొలిపెడు
నెనరు లాడి నుడులు వినుపఁ బోకు
కదనమునకు వచ్చి కరవాల మెత్తక
తేనె లొలుకఁ బలుకు, నానగండ.

చెలిమిని సంధినిం గుఱిచి చీటికి మాటికి బూటకంబుగం
బలికిన యంత దాని విని మానుదు నాలము నంచు నెన్నడుం
దలఁపఁగఁ బోకు, నీదు పయినం గల తొంటి దయా లవంబునుం
బొలిసెను, నీవు నన్నిటు చమూద్వయి ముందు నతీకరించుటన్."

నావుడు భూరి రోష గగనంకష వీచి యువాంతరంగ పా
థోవసధాన లేచి పడె, దోశ్శిఖరాలు చలించె, నేత్ర రా
జీవము లగ్ని వృష్టిఁ గురిసెం, గరవాలముపైకిఁ బ్రాకె హ
స్తావయవం బయత్నముగఁ, జయ్యన రేగె రణానలంబునున్.

ఖరఖడ్గాల్ వెకలించి దూకి, రణముం గావించి రద్ధారవ
స్మరణాపాదక మండలాగ్ర యుగళీ సంఘట్టన స్వాన బం
ధుర రోదః కుహరంబుగా, సుమిత పర్ణోర్వీరుహీ భూత గా
త్రరుగుద్గారము గాగ నిర్వురును వైత్రకాంత్యప్రభా పాంపతుల్.

అవిగో సైకతసీమలో మొగిళులే యారెండుఁ బోరాడు చు
న్నవి, శంపాలతికల్ చలించె, నురుముల్ నానా దిశా వీథులం
దవిలెం, గుంకుమ పంక మాయె నిసుకల్; తారాడె నానేలలం
దెవియో శోకము గొల్పు నీడ లకటా! యేమేమి రానున్నదో?

ఆకసమందు భానుఁ డొక యంబుధర ప్రతిసీర వెన్కకున్
వ్యాకులి తాత్ముఁడై చనియె, నల్లన నెల్లెడ నేవొ మూలుగుల్
ప్రాకెడి, ధూళి, యీయిరువురం, బెనుగాలికి రేగి, చుట్టెనే
సైకతమా! యె దే నొక విషాద పయోదము నిన్ను గప్పెనో!

ప్రకృతి పంథా విరోధ మీ రణము గాన
భాస్కరుఁడు చేరె నంబుదాభ్యంతరమున;
గాలి మూలిగె; నెట్టి శోకాంధతమము
పుడమి మిన్నుల కౌఁగిటం బొడమఁగలదొ?

* * *

అధిక తరాహవ క్లమథు లయ్యుఁ, గ్రుధాభినివేశ దంతుర
ప్రధన రతాభిలాషు లయి రక్తరుచిప్రచయంబు లుగ్ర దృక్
పథములలోన మించి పరవళ్ళను ద్రొక్కఁగ, వారు పుంస్పదా
యుధ యుగళంబుకై వడి మహోగ్ర రణాన మునింగి రెంతయున్.

జనకుఁడు విసరిన కుంతము
తనుజుని మైమఱువుఁ దాకి దానిని వ్రచ్చెన్
మొన నెమ్మేనున నించుక
యును గ్రుచ్చుకొనంగ లేక యుడివడి పోయెన్.

విసరిన యీటె యీ పగిది వీసరమై సొహరాబు పేరణిం
గొన దిగియుండఁ దానిఁ గొనఁగోరి మహోగ్రహజాతహుంకృతిన్
వెసఁ జన రుస్తుమున్ యువక వీర వతంసముఁ డంతలోననే
యసిఁ గొని శీర్షభాగమున నక్కఁసు గ్రక్కుఁచుఁ గొట్టె బిట్టుగన్.

ఆనతశీర్షుఁ డాయె నపురానతశీర్షుఁ, డనన్యసాధ్యుఁడుం
గాని విషాద వారిద నికాయము లింకను నల్లబాఱె, ఘో
రానిల వీచికా చయము లందున నెవ్వో విలాప కాకలీ
స్వానము లుప్పతిల్లె క్షణభా నటనంబు లెసంగె దిక్కులన్.

రక్షకి హేష జేసెను, కిరాత పరిక్షతమై యెడాదులం
గుక్షిని గీలుకొన్న ఘనకుంతముతో నెటకో రయాన హ
ర్యక్షము పొంగి పొర్లు రుధిరంబులు రాలఁగఁ బారిపోయి, సాం
ద్రక్షప నేఁగుదెంచి సికతంబున మే న్విడువేళ పోలికన్.

ఆ హేషాతి వికార నిస్వనమునన్ యావద్బలాస్తోక సం
దోహంబున్ భయకంప మొందెను, ప్రభూతోద్రిక్త వాఃపూరమై
నీహారీకృత మాయె జీవికయు, గానీ దాన నావంత యు
త్సాహంబు న్నొహరాబు వీడక, రిపున్ ధైర్యంబునన్ మార్కొనెన్.

మరల సొరాబు పేరలుక మాద్యదిభారి నిభాభి శోభియై
కెరలి శిరశ్ఛదంబు పయి గంటెను సర్వబలంబు చింది భీ
కర కరవాలముం; దలను గ్రమ్మఱ రుస్తుము వంచె; గాని యా
పరి పిడి కేల నిల్చె కరవాలు ఘణిల్లని ఢుల్ల గుల్లలై.

అంతట రుస్తు మెత్తె శిర మంబక రోష కషాయ దీధితుల్
ముంతల ముంచి పోయు గతి ముమ్మరమై కనుపించె, మించి యా
శాంతము లెల్ల ఘొల్లు మన చండత రాహి దురీక్ష్యమూర్తిమత్
కుంతముఁ గేలఁ బూని జనకుండు మహాగ్రహ నిగ్రహోగ్రతన్.

హస్తోత్తంభిత కుంతమై ప్రకృతి హాహాకారముల్ సేయఁగా
రుస్తు మ్మంచొక ఘోర సింహరవమున్ రోదస్సు నిండార న
య్యస్తోకోగ్రలయావతార మొక కొండంతై వెలారించె, సై
న్యస్తోమం బిరుక్రేవలన్ నిలువ చిత్రాంతర్గతాకారులై.

అది యాలించి, తటాల్న ముందటి పదం బావంత వెన్దీసె, మున్
గదియన్ వచ్చెడు రూపముం గనియె, నింకం జెప్ప నేలా, మదిం
బొదివెన్ నివ్వెరపాటు, నిల్చె నిలువుం బొమ్మై సొరా బంతటం
బదివే లక్కర మేని తక్కువ యగున్ వర్ణింప నాదృశ్యమున్.

ఉన్నటు లుండి కేలఁ గల యొడ్డనముం బడిపోయె, నంతలో
పన్నగ మట్టు లీటె జారఁబారఁగ నయ్యెయొ, రూపు గొన్న ని
ర్విణ్ణత నేలఁ గూలె - నతివేలముగా సికతామయావనిన్
మిన్నుమియంగఁ బొంగి పరువెత్తెను వేడివెలుంగు వెల్లువల్.

* * *

# ఉత్తరభాగము

## ౩

ధ్వజినీద్వంద్వము చూచె రుస్తుమును భాస్వత్ బింబసంబాధకృత్
విజయ స్తంభము వోలె, సంగర ధరిత్రిన్ నిల్చియుండన్, ధరా
రజ విభ్రష్ట పురాణ శిల్ప విభవ ప్రాంచత్ సభా సౌధరాట్
రజత స్తంభమొ నా సొరా బొరిగి నల్లల్ వెల్లువల్ సేయఁగా.

వెగటుగ నవ్వి రుస్తుము, దభిల్లున గొడ్డటఁ గూల్చినట్టి పెం
దొగరుచిగుళ్ళ చెట్టువలెఁ దోచు సొరాబును డాసి, "యో సొరా
బగపడెఁ గాదె నీకు తుద కంతయు, సుంతయుఁ దెల్వి లేక య
ట్లెగఁ బడినాఁడవే కలని కెంతటి వెంబర విత్తువో గదా!

ఆలమునందు పార్సిక భటాగ్రణి నొక్కని నేవిధాననో
గూలిచి వాని మేన వెలుగొందెడు పేరణి సీసకంబులన్,
వాలును, గెల్పు చిన్నెలుగ వ్రాలి గ్రహించి, భవన్మహీపు నా
డ్డోలగమందుఁ జూపి పొగ డొందఁ దలంచితి వెంత యాసయో!

బండెం, భండన దుర్నిరీక్ష్య ఖర తేజోధ్వాంత మార్తాండ రూ
పుం డౌ రుస్తుమె వచ్చి నిన్ను గవయం, బోరుంధరం గాన్కలం
గొండాటంబులఁ గూర్చి బందసమమౌ గుండెం బువుం జేసి నె
య్యుండుం గైవడి నేఁగ నెంచితి వహో! యుష్మన్మనోవైఖరుల్.

ఏతత్తావక వీర కార్యములఁ దా మెంతేని టార్టార్ భట
వ్రాతం బాత్మల నక్కజం పడి నినుం బాటించి పెన్గోదుగా
నీతో సాటియె లేఁడటంచు యశమున్ నిర్మింప, నీ తండ్రికిం
బ్రీతిం గూర్పఁ గడింది నీదు మది యువ్విళ్లూరెనే డింభకా!

అది సాధించిన నంతె కెక్కుడు నటం చాశించితో మూఢుఁడా!
తుద కా గొంతెమ కోర్కె దొంతర లవెందుం బోయెనోగాని, నీ
బ్రదు కీరీతిగ నేలపాలయి చనెన్ వ్యర్థమ్ముగా, తండ్రికిం
గొదువై సమ్మద మెల్ల, నేఁడు గలిగెన్ గోమాయుసంఘాలకున్.

ఊరుం బేరును లేనివాఁ డొకఁడు ని న్నుగ్రాహవ క్షోణిలో
శూరుండై తెగటార్చ నీ కది యశస్సుం గూర్చునే, యల్ల నీ
వీరాలాపము లెందుబోయె, కుహనా వీథీ విహారంబు లే
దారింబట్టెను మూఢుఁడా! తుదకిటుల్ దైన్యాంతముంబొందితే?"

అన నీరీతిగఁ గోప శోకములఁ దన్నావంత యుద్వేజితా
త్ముని గానీయక పండువెన్నెలఁ దడంపుం బిండు నిండారి తొ
న్కని కాదారిని బోలె సోరబు ప్రసన్నాకార రేఖా ప్రభా
ఖనియై, నాటిన యీటెతో నిసుకపై కైవ్రాలి పల్కె న్నిటుల్:

"ఊరుం బేరును లేనివాఁడ నగు నే నుగ్రాహవ క్షోణిలో
శూరత్వం బెసలార ద్రుంచితి గదా సోరాబునం చూరకే
పూరా బొంగకు మాత్మ, నాదు పతనంపుం గారణం బీవు గా
దా రుస్తుమ్మని నమ్ము మోయి స్వనుతి వ్యాపార పారీణుఁడా!

ఎవ్వఁ డెఱుంగ కున్నతఱి నిప్పగిదిం బయిఁ బడ్డ రీతిగా
నవ్వర నామధేయము శ్రవోంతర వీథులు సోకినంతనే
నివ్వెఱ గ్రందుకొంట నవనీచ్యుత శస్త్రుఁడ నైన వేళ న
న్నివ్విధిఁ గూల్చినాఁడ వగునే మగపాడి యనంగ నిద్దియున్.

కాకున్నన్, నినుబోంట్లు నూఱుగురు నన్ గయ్యాన నొక్కుమ్మడిన్
డీకొన్నన్ భుజ దండ చండతర ధాటిం జిక్కి యాయెల్లరుం
జీకాకై ధరఁ గూలరే, యిచట తచ్ఛిద్రాంగ రక్తంబు పె
న్వాకల్ గట్టి స్రవింపదే జయ రమా వాల్లభ్య, మేనొందఁగన్.

ఆ నామామృత శీకరావతరణం, బా తావకాకార రే
ఖా నిర్యన్మృదు భావనా జనక రుక్సందోహమున్, నన్నలో
కా నిర్వాచ్య మనోదశా వశునిగం గావించె, నిర్విణ్ణతం
బూనించెన్ వసుధాచ్యుతాయుధుని నన్ బోరుంధరం గూలిచెన్.

'ఏవం భూతము గాదు నారణ కళా హేవాక భావాకర
గ్రావాకార రమా సమాగతము, నా రాజద్భుజాసాదితం
బీ విన్నాణపు గెల్పు దొయ్యలి యటం' చీరీతి నాత్మస్తుతిం
గావింపం దొరకొంటి, వేను విగతఖ్యాతుండనై మేన్విడన్.

కాని మదాంధుఁడా వినుతు - గాత్రలతా పరివేపధుండవై
వీనులు నిక్కబెట్టుకొని విందువు గాక! యరిందముం, దమం
దానుపమాన శౌర్యనిధి, నా జనకుం డగు రుస్తు మెంతయుం
దీనికి నంగలార్చి పగ దీర్పక వీడఁడు నిన్నెఱుంగుమా!"

నా విని క్రేణి సేయు గతి నవ్వుచు, నాడొక యాభవాంత శో
కావహ ముప్పతిల్లెను స్వయంకృతమై యను తెల్వి లేక, తా
నీవగఁ బల్కె రుస్తు, "మిది యేమిటు పల్కెద వోయి, వెఱ్ఱికిం
గైవస మైతివే, సుతుఁడొకండు గలం డను దీవు రుస్తుమున్"

అనినన్ వెస నశియించెడి
స్వనమున సొహరాబు మారు పల్కెనిటులు, "నే
ననునది యంతయు నిజ, మా
తనయుం డాసన్న చరమ దశఁడను నేనే!

ఆ సుధా మయ మూర్తి యా వీరవరుఁడు
నా సర్వ భూపరిణాహ గవేష
ణైకలక్ష్యం బగు నా కూర్మితండ్రి
యెచట నున్నాఁడొ తా నెటుల నున్నాఁడొ
యీ వార్త విని యాతఁ డెంత చింతిలునొ?

కడుపు చిచ్చున మండి కడు నుగ్రుఁ డగుచు
'నేది నా యాయుధం బేఁడి ఘాతకుఁడు'
అని పుడమి వడక బిట్టార్పును వెట్టి
పగ తీర నిన్వెదకి పట్టి బలి గొనక;

మా తండ్రి వగచు నెమ్మాడ్కి నాకొఱకు?
మా తండ్రి పోఱు నెమ్మాడ్కి నాకొఱకు
నది గాంచు వఱ కేని నసువులు మేన
నిలుచునో నిలువవో - నిలుచునే యకట!

అయ్యో! ప్రాణము లేనుగా బ్రతుకు ప్రేమాంభోధి నా తల్లి; మే
నొయ్యొయ్యం జర గ్రుంకు నిప్డు దయలే కొక్కింతయుం, బుత్రకుం
డియ్యత్యాయత మైన లోకమునఁ దన్నేకాకిగం జేసె; న
య్యయ్యో మానస మెట్టు లొప్పెనని యేమై పోవునో నెవ్వగన్.

దురపు నేలల గెల్పు దొరలించుకొని వచ్చి
యిలు సేర బారించు నెలమి సెలలఁ,
బారించి కౌఁగిట సారించి నెమ్మేను
తలిరుగేలున నల్ల దడవు దడవు,
దడవి యల్లంబున తనివి దీరక యున్న
గుశలమే యని గ్రుచ్చి గ్రుచ్చి యడుగు,
నడిగి యిరుగు పొరు గమ్మల కెరిగించు
గొసరి యామెత లింట నెసఁగఁ జేయు

మోదమునఁ బొంగు నా తల్లి, నాదు రాక
రాకయై యొప్పు ప్రణయ వారాకరంబు
నేను చేరక యీ వార్తఁ నేడు చేర
నయ్యయ్యో కన్న కడుపెంత యావటిల్లు.

గొనముల వంగడంబునను కొండికవాఁ డగు జోదు యీపెచే
తన సిరి దూరదేశ సికతావని పాలయి పోవ, మున్నటుల్
కనుగొన లేదు నన్ను, తన కన్నుల వెన్నెల వత్తి, గెల్పుమై
యని బువి వీడి సేమముగ నాగతుఁ డౌటను తా నిఁకం గటా!

నైక సమీక భూత విజయ స్ఫురణా పరిణాహ సూను రే
ఖా కమలాకరంబులుగఁ గ్రాలెడు నాలయ సీమ లెల్ల, నా
రాకయె లేక చీకటుల రాపిడులం గడు చిన్నవోవ, తా
నేకరణిన్ వసించు జననీమణి యచ్చట శోకమూర్తియై.

పండిన దోస తోట వలె పాపలు బిడ్డల కాపురంబు గా
దొం డెది యేనియుం బెడద యుప్పతిలం, బదిమంది పల్కులం
గొండికదై యడంగ నది; కూరిమి పట్టి నొకండ దక్క వే
ఱండయె లేని యామె కెవ రౌదురొ బాసట యూరడింపఁగన్."

అని తన తల్లిని దండ్రిని
తన యాసన్నావసాన దశను దలఁచుచున్
మనమునఁ బొంగెడు శోకం
బును బట్టగ లేక యెక్కు మొగి బిట్టేడ్చెన్.

పురపుర బొక్కు రుస్తు మటు పుత్రకుఁ డేడ్వఁ, దలంప సాగెః, దా
మరచిన పేరులుం గరము మాసిన తొల్లిటి జీవితంపు చి
త్తరువులు బల్మిమై మదికి దారిచెఁః గాని కుమార రూప మే
మఱుగున గానరాదు, పలుమారులు గాంచె కుమారి రూపమే!

"నాకు కుమారి పుట్టె నని నాఁ డెఱిఁగించి, రదేల కల్లయౌ;
లోకములోన నాదు కొమరుం డని చెప్పుకొనంగ గౌరవో
ద్రేక మటంచు నీతఁ డిటు చెప్పెనొ? కాక యదేచ్ఛఁ దన్నుఁజా
మీకరతోషితుల్ నలుపు మేరయె లేని పొగడ్త నమ్మెనో?

అని తలపోయు చుండ తన యాంతిమకాల విలాప కాకలీ
నినద కలాపముల్ చెవుల నింపుచు నుండెను; కొందలంబునుం
బెనుపడి యంతకంతకును భీకర సంకులతం ఘటించి నె
మ్మనమును నాతికాలమున మారిచె బున్నమ సందరంబుగన్.

తలపు గిలాతలముల్ వెడలి దవ్వుల కెవ్వలకో కడింది యా
కులమున బార నశ్రుకణ కోరక వారము గ్రమ్ముదేర, నా
బలితపు గోటి పాటనకు పాతము నందిన పూవుపోలికన్
ఇలపయి నున్న పట్టిఁ దిలకించుచు నుండెను రుస్తు మన్ననన్.

గౌటియల కాపరీఁడు తన కొండ యిలారము నుండి యెండ రా
తురగలి కందరంబులను దూరి గమించి రుచిప్రతానపుం
దరగల దేల్చు దూరపుర తల్లజముం దిలకించు సంచునన్
దరిపి దినాల తన్ను గనెఁ దండ్రియుఁ గన్నుల నీరు జొబ్బిలన్.

కొమరుం బ్రాయపు వెల్లియౌ నతిని, బ్రాగోటన్ ఖగగ్రీవపుం
గుమిక్రోల్పుల్ తెగమారుమ్రోగు నలువౌకోనన్, ప్రభాతోల్లస
ద్దిమ బిందూత్కర సుందరాయత వనోద్దేశంబులం, దన్మనః
కమలం బందునఁ జూచె యౌవన రుగుద్గారంబు తోరంబుగన్.

నాటి వినోద మోదములు నాటి నవీన వయో విలాసముల్
నాటి మనోహరాకృతియు నాటి దురంబులు నాటి వేటలున్
నాటివి సర్వముం దలఁచి నాడెపు సోరబు మోము జూచి నే
నేటికి జాలి మాలి పొలియించితి నంచు మహానుతప్తుఁడై.

"హా! నవ దీధితి ప్రకర హారి విరోచన రోచమాన, ని
ధ్యాన మహావహాంగ, మహదాహవ దోహల బాహు బంధ సం
ధాన జయేందిరా విభవ, నా సొహరాబ, యపార చింతకుం
దానక మైతి నీ ప్రచుర దారుణ మారణ కారణుండనై.

నీ రారాజ దుదార ధీరగుణముల్ నీ విక్రమస్ఫూర్తియున్
నీరాగార పరీతభూ నిబిడమౌ నీహేతి విఖ్యాతియున్
ఔరా! నీవ సుతుండ వైన మురిపెం బారంగ నో రంగదా
కారా! వీరవతంసు రుస్తుమును సౌఖ్యాంభోధి నోలార్పవే.

తన కెన యనఁ దగు కొమరుని
గని యెలమిని మనెడు సిరిని గనక, యతఁడు బల్
కనకపు దునకని జనులన
దన మనమున వనరు మొనయ దనయును గనియెన్.

తాదృశాభాగ్య దహన దందహ్యమాన
మానసుం డేడ, చండాసమ ప్రతాప
తాప తప్తారి నిర్మితోదార కీర్తి
యా కొమరుఁ డేడ? నక్కడ నాక మేడ?

నందను ముద్దు చెయ్దముల నందము బొంద నతండు నోచలే
దిందున నో సొరాబ, భవదీరిత మెల్లను బొల్లు వోయె, నీ
విందుల కేమి యందు' వని యిట్టు లలందురు డెంద మందునన్
దందడి గందళింపఁగ నతంద్ర భటాగ్రణి రుస్తుమన్ తటిన్.

అంతకు నంతకున్ బలుపు నందిన కుంతపు బాధ యింక నా
వంతయు సైపఁజాలనిది యైన, నిజోదర సీమనుండి యా
కుంతము దీసివైచి మది గోరెడు శాశ్వత శాంతి నందఁగం
జింతన జేసెఁ గాని, యిది చెప్పెదమున్నని, సోర బిట్లనెన్:

"అసువులు వాయువారి రస నాంచల సీమలు సత్య దేవతా
వసితము లోయి, కల్ల యన - వాతెరఁ బాతర లాడలేక, నే
నసువులు మేనఁ దాల్చి మనినన్ని దినంబులు దూర దూరమై
మసలెను, గాన వాదములు మానుము కానము మేలు వానిలో.

ఇదిగో! చూడుము, మున్ను రుస్తుము కరంబింపార మాయమ్మకున్
'సుదతీ! నీ కను చిన్నిపావ కొగి నచ్చుం గ్రుద్దు మీముద్రికన్
ముదమారం గనుగొందువెన్కఁ' ననుచున్ ముద్రాంగుళీయంబిడెం
గదనం బేఁగుచు, దాని మచ్చ యిచటం గాన్పించెడిం జేతిపై."

ఇటులు సొరాబు కట్టలతి యెల్గునఁ బల్కి వెసం భుజత్రముం
దిటవరి యున్న వ్రేళ్ళ నెడ దీయగ సాగుడు, మోము వెల్లనై
తొటతొటఁ గాళ్ళఁ దుంపెసలు దోచె, యెదం దడ దండడించె, నె
క్కటి బవరంబు లాడు మొనగానికి సోరబుఁ గన్నవానికిన్.

నా ముద్రాంకము గాదులే యనుచు, నెన్నం డేనియున్ మున్ను వి
న్నామే యిట్టి మహాద్భుతం బనుచు, నైనం జూపు మేదంచు, నే
మేమో గొణ్గు చళీకహాసము వెలారించుం, గృతోదగ్ర సం
గ్రాముం డంజిక పింజరింపగ మనః కంజాత సంజాతమై.

సుతుడు దలంగి కైమఱువు, "చూడుము రుస్తుము దైన చిహ్నమో
యితరుల చిహ్నమో కని వచింపుము, వాదుల నేమి చేకురున్,
మతిరహితుం బలె న్నిటుల మాటికి మాటికి సంశయించి, నన్
వెత గుడిపింపఁబోకు మిఁక, వ్రేగగుచున్నది జీవ" మన్నెడన్.

భయ విభ్రాం త్యనుతాప మన్యుముఖ భావానీక కల్లోలి తా
శయుఁడై, దీర్ఘ విలోక నోద్భవ నిమేష న్యూన చక్షుః కుశే
శయుఁడై, పాంసువికీర్ణ శీర్షరుహ సంసద్భాగ భాగంగుళీ
శయుఁడై, రుస్తుము నిల్చె కొంతవడి యాశ్యానావనీజ క్రియన్.

అంతటం గొంతెత్తి "అయ్యయో, బిడ్డ!
కడుపారగా నిన్ను కన్నట్టివాఁడు........"
అనుచు నేదియొ పల్కఁ నంగవించియును
ఖేద మేదురతచే సాదమై యెల్గు.

నీలాంబుదము లీల నెమ్మోము పైన
శోక భావ చ్ఛాయ ప్రాకుచుం బోవ
నుమ్మడిం దెలివేది యమ్మగం డిలకు
నవరుగ్ణ భూమీరుహము బోలెఁ గూలె

అడ గైకొన్న కృపారసం బయి సొరా బావంకకుం బ్రాకుచుం
గెడకుం జేరి తుషార మొల్కు గొనబుం గేల్దోయినిం దండ్రి దౌ
మెడచుట్టుం బెన వైచి మోవులను నెమ్మి న్ముద్దు గొంచున్మదం
పడి 'నాన్నా!' యనుచుండఁగాఁ దెలిసె నా భగ్నాంతరంగానికిన్.

వికలింపం గనుదోయి, కట్టెదుట నవ్వృద్ధాత్ముఁ డత్యుగ్రమౌ
స్వకృతైన స్తుహినాలయంబు గని కేశానీకముం బీకుచున్
సికతం గైకొని కేశ్మ బిట్టుఱుచుచున్ చిక్కం దలం బుల్కుచుం
బెకలించెం గరవాలు జీవములపై పేరల్కు మొల్కెత్తగన్.

అది గని సొహరా బాతని
హృదయంబు నెఱింగి, "యాగు మాగుము తండ్రీ!
యిది నీ చేసిన చేతఁగ
మది నెంచితి వొక్కొ నీవు మరణించుటకున్?"

అనిన రుస్తుము వాలు నవనిపై విడిచి
నత శిరుండై యుండ సుతుఁ డిట్టు లనియె:

దాత లిఖించినాఁడు వసుధా తల జాత సమస్త భూత సం
ఘాత ముఖాల జీవిత విఘాతక రేఖను, సాధ నార్థమై
యాతఁడు వోవు త్రోవ లితరావిదితంబులు, కానరాదు ఖ
ద్యోతుని బెట్టి చూచినను దుర్ఘట మాతని వాఙ్మయంబునన్.

నా మరణంబు పొంచె నిను నా జనకుం గలరూపెఱుంగ నీ
కా మిడి మేలపు న్విధి లయ ప్రియ మానసుఁడై యభావ్య సం
గ్రామముఁ గూర్చి నీ కఱకు ప్రాసముపై నను వైవఁ గూలినా
నీమెయిఁ గాసి నా పయిన నీ వది వైచుట నంచు నెంచితే?

తొలుతం దావక మూర్తి నాకనులమున్ దోచంగనే, తండ్రిగం
దెలియం జేసె మదంతరాత్మ, సుమ సాదృశ్యంబు లౌ వాకులున్
వెలలెన్ వాతెఱ దాటి; మీరు కరుణా నీరాశియై రంతటం,
గల రూపుం బొడదోచె నీదృశ నిసర్గ స్నేహ మోహంబునన్.

ఈరీతిం బ్రేమోల్బణ
భూరి ప్రారంభితం బపూర్వ సుత పితృ
ప్రారజ్య త్సంగమ మీ
తీరాయెం దుదకు భాగధేయము లేమిన్.

పూచినయంతనే మొగలి పూవును చూచి సుమాశ మొంది మూ
చూచిన లోని త్రాచు కఱచుం గతి యాయెను నాయెడన్-సరే-
యే చిరకాల మామక సమీహిత సిద్ధి త్వదీయ లోచనా
సేచన కాకృతిం గనుటఁ జెల్లునో, యయ్యది చెల్లె నంతయున్.

అదియే పదివే, లిఁక యే
కొదువయు లేదగుట నాకు కొందల మేలా?
ముద మారగ జీవంబులు
వదలెద జనకాంకభాగ భాజ్మస్తుఁడ నై.

జనకా! రమ్మిటు నా శిరమ్ము భవ దుత్సంగమ్మునం దిమ్ముగం
గొనుమా, వీనులఁ దేనెవాన గురియం గొంతెత్తి ‘నాపుత్రకా!’
యనుమా కన్నుల గూరు నీరములు నాయాస్యంబుపై రాల్చుచుం
గను నాశ్వాసము నాత్మ, జీవితపు టేకైకార్థ మీ రేడుటన్. —

అతిరయ మేగుదెమ్ము జనకా, కొనప్రాణము నిల్పికొన్న నా
కతిపయ జీవికా చరమ కాల నిమేషము లేగుమున్నె, యే
నతులిత చంచలా లతిక యంగమునన్ భువి మెట్టినాఁడ, నా
కత ముగియంగ గాలియల కైవడిఁ బోవుచు నుంటి వెంటనే."

అది విని కన్నతండ్రి కడు పగ్గి తగుల్గొనినట్టులైన, నం
గద నెద బట్టలేక 'కొడుకా!' యని పైఁబడి యేడ్వసాగె; న
య్యది గనుచున్న సేనలు భయంపడె; రక్షకి యెండకాలపున్
నదివలెఁ జేర వచ్చెఁ గడు నాలినడం దల వ్రేల నేలకున్.

వాలిక యుబ్బు జాపి యిరు వంకకు నూపుచు వారి నిర్వురన్
జాలిగఁ జూచుచు న్నిలచె జక్కి; మనఃకష శోకసాగ రో
త్తాల తరంగ సంకుల విధంబును దెల్పగ లేని దాని పె
న్నీలి కనుంగవం దొరగి నీరపు బిందువు రాలె నేలకున్.

తనయుం డా తురగాననాగ్రమును చేతం దాకుచు న్నిట్లు వా
కొనె - 'నో రక్షకి! యెన్నినాళులకు చక్షూవారి రుణోన్మదముం
బొనరింపం గనుపట్టినావె, యెపుడో పౌన్నారినై యున్ననాఁ
డనుచుండె న్నినుగూర్చి నా జనని ప్రేమార్ద్రి ప్రశంసోక్తులన్.

శకలిత నైక నీవృత విశాల పథోపల, ఘోర ధాటివిన్
సకల రసా భటాగ్రసర సంవహనాహిత కీర్తి చంద్రికా
ప్రకటిత నామధేయమవు వారువమా! కొనియాడ శక్యమే
యొకరికి నీ దురాసద మహోజ్జ్వల వైభవ భాగ్యరేఖలన్?

తత మోదంబున మెట్టుచుందువు 'శయిస్థానా'వనీ సీమ, మ
త్పితృగేహాంగణ వాత పోతముల బ్రాతిం బీల్తు వారామ రా
జిత కాసార వినిర్మలాంబువులు సంసేవింతు వాదేశమున్
క్షితికంఠాభరణాగ్ర రత్నమును వీక్షింపంగదా నే నిఁకన్.

కన్నుల కింపు గాని పెను కర్రి గుడారు, లెడారి నేలలుం
జెన్నొక యింత లేని వగు చిన్ని పురంబులు, నెడ్డెజాతులుం
జెన్నటి కయ్యముల్ నెగడు సీమల నే మనినాఁడ, నల్ల నా
పిన్నటి నాటగోలె పితృవిద్వేష దంతరవాసినై కటా!

ఇప్పు డివ్విధాన నీ వాహినీతటి
జీవములను బాసి పోవుచుంటి
నడలు విడిచి తండ్రి నడి సన్నుల మెలంగి
బ్రతుకు వేయినాళ్ళు పట్టు సఖుఁడ!"

గొల గొల తండ్రి యేడిచెను గుండెలు నీరగునట్లు, 'జీవికా!
తొలకరి మించు మించు నిజ దుర్లభ పుత్రుని గోలుపోయి యే
లలి నిల మేను మోయగఁ గలాఁడను, నన్ గొని పోవ నీదు పె
న్నలలను బుచ్చరాదె దయ యన్నది సున్నగదే' యటంచునున్.

అంతం బుత్రకుఁ డిట్లు పల్కె, 'జనకా! యాలింపలే నానొడుల్
ఎంతో కాలము భూమిలో నిలిచి యెన్నెన్నో భవ ర్భ్యారి వి
క్రాంతిం జూపి రణంబులన్ సలిపి, విఖ్యాతిప్రభాళిం దశా
శాంతోన్మీలితముం బొనర్పు మదె నాకామోదముం గూరుచున్.

అచలాగోళం బిటులే
పచరించుచు నుండు దాక భావిజనంబుల్
వచియింత్రు గాత విక్రమ
రుచిరుని నైదం యుగీన రుస్తు మటంచున్.

అలుకఁ దగిలి తార్తరులఁ బట్టి చంపక
యాలు బిడ్డల గలియంగ నిమ్ము
ధాత సేత కెట్లు దండనీయులు వారు
కరుణఁ జూడుమయ్య, కన్నతండ్రి!

ఏ నిట నోసరించిన మెయిం గొనిపోయి యెడారి సీమలో
దాని పయిన్ రచింపు మొక తారలఁ దాకెడు కంబమున్ జగత్
స్స్వాన విహీన యామినుల దాని గభీరిమ నాదు జీవితా
ఖ్యాన విషాదముం దెలిపి యశ్రులఁ దేలుచు బాటసారులన్."

అనపుడు నెడ నెడ నుడులుం
దునియఁగ, నిక్కరణిఁ దండ్రి నొడివెం, "బుత్రా!
పొనరింతు నయ్య నీ కో
రిన గతి; నూరట నదిచ్చు లేశం బైనన్.

అకటా! యెందఱినో రణం బను మహోఖ్యం గూర్చి కారుణ్య మిం
చుకయుం జూపక హత్య సల్పియ గదా, శుంభ ద్యశః సంపదన్
సకలోర్విం గడియించినాఁడ, నను షుస్రాస్రప్రవా హోవగా
హక వృత్త్యర్థము ధార వోసితి మదీ యాయుస్సు సర్వస్వమున్.

శ్రుతులకు తేనెలై శిశిర రోచులు కందొగ దోయికై, వపు
ర్లతలకు జీవనంబు లయి రాజిలు పుత్రులఁ జంపి, యెందఱం
బితలను శోకసింధువునఁ బేరు గడింపగ ముంచినానొ! యా
కతమున పుత్రసంపదను గన్నులఁ గానక కాళ్ళఁ ద్రోసితిన్.

కొలదికి మించు దోసముల గొంచక సల్పిన నేను గాక, యీ
విలయ కరాళ దేవతకు విందయి తీవకటా, కుమార! ని
న్నిలపయి బెద్దకాలము సుఖింపగ నిచ్చి, మదీయ జీవముల్
బలి యిడియేని బ్రోచెడు కృపామతు లెందును లేరె ధారుణిన్?

శ్రీకర చంద్రమః కర విజిత్వరి నీ వర రూప కాంతి, యా
లోక దురాసదం బయి యలోక పథంబులఁ జేర నున్కి, నీ
లోకము దోచె మామక విలోకము నందు తమోంబు రాశియై
ల్లోకము దోచె మామక ఖిలోకము నందు తమోంబు రాశియై.

ఆయుధ సంచయంబు లస్పృగార్ద్రి కరార్జిత కీర్తియుం, దరా
నాయక సత్కాటాక్షములు, నశ్వర మీకుసుమాల యోలమున్
బాయక దాల్ప నేమిటికి బాసి మతి న్నిటు చేతులారఁగన్
నా యెనలేని సౌఖ్యభవనమ్ము̃ను గూలుచుకొన్న యాదటన్.

అరుణుని యెండలాతుకొను నంచులు లేని యెడారి సీమలం
దరిగెడి బాటసారి చెవియందు, తమస్సులు కాచుకొన్న భీ
కర విపినమ్ములందు నలిగాడుపునై, పగ గూర్చునట్టి వౌ
సౌరములు నింపుచుం దిరుగుచుండఁగఁ గోరెదఁ బ్రాభితంబుగన్.

అనుచు నిదంవిధ పరిదే
వనముం బొనరించు జనకు భగ్నాశయునిం
గని, కనికర మిగు రొత్తం
దనుభవుఁ డాశ్వాస గుంభన ప్రయతుం డై.

"కాల మాగునె? శోకింప నేల తండ్రి!
కన్నుదమ్ముల బాష్పాలు గార్చె దీవు
బాష్ప సందోహ జనిత ప్రవాహ మైన
ధాత విరచిత మగు నొక్క గీత చెడదు.

వీర కులోచి తాంత మొదవెం గద, యంగద దాని కేల, నీ
వోరిమి మాలి యొడ్లవలె నుంట యొకింతయుఁ బోల, దర్శనం
బారము నుజ్జగింపవె యభంగుర సంగర రంగ చంగిమో
దార కృపాణ ధారివి, మదారి విదారివి, విక్రమారణీ!

కనుదమ్ముల్ విరియించి, వత్తునని, యుత్కంఠ న్నిరీక్షించుచున్
దినముల్ వుచ్చెడు కన్నతల్లికి స్వరు ర్నిర్ఘాత మీవార్త- యో
జనకా! యూఁటట గూర్పు మామెకిఁక నేఁజాలింతు నాయోలముం
దనరుం గావుత నీదు జీవితము, జ్యోత్స్నాకాశనీకాశమై!

—: సమాప్తం :—

## "చండాలోఽపి మమ గురుః"

అతఁడు పూజ్యుఁడైన మిహికాంశు ధరాంశ సముద్భవుండు, న
ద్వైత మతాద్యకర్త, ప్రతివాది భయంకరు డాది శంకరుం
డాతటి కాశికాపురి కుపాంతమునం బ్రవహించుచుండు, గం
గాతటినిన్ మునింగి వడిగా పురికిన్ జనుచుండె నెండలో. 1

బాలాబ్జుండు ముఖంబు జేరెను, జటాపాశస్థకూలం కషా
కీలాలంబు కమండలంబున నణంగెన్, రౌద్రకీలావమత్
ఫాలాక్ష్యార్చులు బొందె ధీః ప్రచురతాభాస్వదృగబ్జంబులన్
బ్రాలేయ ద్యుతి చూడు డిట్టు లవతారం బెత్తె నుర్వీస్థలిన్. 2

కాళులు గాలగా నడచి కాశిపురంబున కేగుచుండ, చం
డాలు డొకండు దారి నపు డాతనికిం గనుపించె వాడునున్
చాలియు చాలనట్టి యొక జానెడు మాసిన గుడ్డ పేలికన్
దాలిచియుండెఁ దీరని క్షుదన్ గృశియించిన మేన దీనతన్. 3

వానిని గాంచి యాతడు చివాలున దూరముగా తొలంగి, కో
పాన వచించె "నోరి తులువా! కను లెచ్చట బోయెరా, యిటుల్
స్నానముఁ జేసి శుభ్రముగ సద్విజుఁడం జనుచుండ మత్తతన్
బైన బడంగవత్తు విటువంటి మలీమసమైన మేనితో. 4

అమరధునీ ధరాంశభవు డయ్యును నామిష రక్త పూర్ణకా
యము, క్షణికమ్ము, నందుగల యాత్మయె శాశ్వతమం చెరింగియున్
భ్రమపడి మానవత్వమునఁ బ్రామిన దోషవశాన శంకరుం
డమిత నికృష్టవాక్యముల నాగతిఁ దిట్టెను తోటిమానవున్. 5

పాపము! మాలవా డపుడు బాపని తిట్లకు చిన్నవోయి, యా
వైపు మొగంబు జూప వెఱపై తలవంచెను గాని, శంకరుం
గోపవశారుణేక్షణుని గూర్చి వచించెను, రోషమాత్మలో
వేపుచునుండఁ గుండె దిట వెట్టులొ జేసి వినమ్రశీర్షుడై. 6

"ఓ సామీ! క్షమియింపుము,
జేసితి నజ్ఞానవశతచే నీతప్పున్
దాసుఁడ దండము బెట్టెద
నీ సరణిని రాకయుందు నెన్నడు నింకన్. 7

ఓ లసదాస్య! ప్రశ్నగల దొక్కటి, తక్కినవారికింబలెన్
మాలలకుం శరీరమును మానము నుండగ మాసినట్టిదౌ
చేలముఁ జూచియా మరి కృశించిన మేనునుజూచియాఁ యిటుల్
మాలలటంచు బోయెదరు మానవులందరు మాకు దవ్వుగా. 8

ఓ కమనీయ దేహ! పని యున్నపు డన్నము మాకు, లేనిచో
నాకటి బాధచే గుడిసెయం దొక మూల బరుండి మూల్గుచే;
యాకలి, కూడు లేక, యెటులాగును, మేనగలట్టి కండలం
బీకి భుజించుగాని తన భీకరదంష్ట్రల- నట్టి యాకటన్
జీకెడు మాకు మీకువలె జేకురునే పరిశుభ్ర దేహముల్? 9

నీ యనుగైన మేనువలెనే యితరంబుల నైత మెన్నగా
నాయజు డొక్కటే యగు పదార్థముతో నొనరించెగాన నీ
మాయజగాన బుట్టు మన మందర మొక్క విధంపువారమే
కాయము పాంచభౌతికము గానిది లేదుగదా ద్విజోత్తమా! 10

మల మయమున్ వినశ్వరము మానవు మేను, తదాత్మ నిత్యమై
వెలిగెడు జ్యోతి, చావనెడు భీతి నెఱుంగని దట్టిదైన యా
వెలుగు ప్రధానమా, తొఱగు పేగుల తిత్తి ప్రధానమా, మను
ష్యుల కిది దోచదా, యెరిగియున్న మహాత్ములు మీకు దోచదా? 11

తా మేతెంచుచు నుండు మార్గమున నైతం బేను రాగూడదా?
నా మాటొక్కటె, యుత్తరం బిడుము నన్నంటంగ రాదందురే,
యీ మాలిన్యపు తోలునా? యటులగా కిందుండు నా యాత్మనా?
యేమో! సామి! యెఱుంగ దెల్పుడిది-మీరెన్నంగ బ్రాజ్ఞుల్ గదా. 12

మాలని మాటలాగె- మన మందున జ్ఞానము దోచె- శంకరుం
డేల నికృష్టవాక్యముల నిట్టులు తిట్టితినంచు చింతతో
మాలని కాళ్ళపై బడె క్షమాపణ వేడగ, మాలవాడునున్
నేలకు వాలి లేచి తల నెత్తెడు లోపునఁ బోయె మాయమై॥ 13

ఆననమందు నవ్వు తొలుకాడగ నచ్చట నిల్చె నంతలో
మౌని నికాయ సాగర హిమాంశుడు, వ్యాసుడు, శంకరుండునున్
తోన నమస్కరించి మునితో నిటులన్ వచియించె నంతటన్
మానసమందు సంభ్రమ సమన్వితుఁడై యనుతాపఖిన్నుడై. 14

"పరమగురూ! క్షమింపుడు! కృపామతులై, మిము నిష్ఠురోక్తులం
బొరపడి నిందఁ జేసితి - వపుర్గతదివ్య సదాతనాత్మ దీ
పరుచిని జూడకుండ, క్షణభాఙ్నిభదేహము జూచినాడ - నే
నెఱుగమి చీకటిం బడితి నింత యెఱింగియు లోకవృత్తిచే॥ 15

కాలము దీరునంతవరకు కాత్మ వసించును మేనిలోన ని
ట్లాలయ భూతమౌ వపువునందలి దా పరమాత్మ దివ్య శో
భాలవమేయగుం గనుక ప్రాజ్ఞుల కందరు పూజనీయులే
మాలడునున్ మహీసురుడు మద్గురు లిర్వుర కేను మ్రొక్కెదన్' 16

అనుచు నుండునంత - వ్యాసుని నగు మోము
గాలి కడలిలోన - కలసిపోయె
మంచి మనసుతోడ - మధ్యాహ్న భిక్షకై
శంకరుండు కాశి - వంక జనియె. 17

ఆంధ్ర క్రైస్తవ కళాశాలా పత్రిక (గుంటూరు)లో నుంచి (**A.C. College, Guntur, 1946**).



# శేషేంద్ర పుస్తకాలు

కవిత :

1. ఆధునిక మహాభారతం (నా దేశం - నా ప్రజలు, మండే సూర్యుడు, గొరిల్లా, అరుస్తున్న ఆద్మీ, సముద్రం నా పేరు, సీరై పారిపోయింది, శేషజ్యోత్స్న)
2. జనవంశమ్ (ఋతుఘోష, పక్షులు, చంపూ వినోదిని, తదనంతర వచన గేయ కవితలు)

సృజనాత్మక వచన కృతులు :

1. మబ్బుల్లో దర్బార్ (హాస్య నాటిక)
2. విహ్వల (కథలు)

విమర్శ :

1. రక్తరేఖ (డైరీ)
2. కాలరేఖ (వ్యాసాలు)
3. కవిసేన మేనిఫెస్టో
4. షోడశి (రామాయణ రహస్యాలు)
5. స్వర్ణహంస (హర్ష నైషధంపై పరిశోధన)
6. సాహిత్యకౌముది (పూర్వాంధ్ర కవులపై విమర్శ)
7. నరుడు నక్షత్రాలు (వ్యాసాలు)
8. విశ్వవివేచన (సైన్సు వ్యాసాలు)
9. ఊహాలో........ (వ్యాసాలు)
10. ఎంతకాలం ఈ ఎండమావులు? (పత్రికా వ్యాసాలు 1995)
11. సాహిత్యదర్శిని (లేఖలు, ఇంటర్వ్యూలు, వ్యాసాలు 1995)